శ్రీమద్భగవద్గీత
(పంచమ ముద్రణము)
వ్యాఖ్యాత:
శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
వెల రు. 4-0-0. పోస్టేజి రు. 0-9-0.
ఆంధ్ర గ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.

# ఆంధ్రపత్రిక

తెలుగు మెఱుగులు
గ్రంథకర్త:
శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
వెల రు. 2/- తపాలాఖర్చులు 0 7 0
ఆంధ్ర గ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.

317583

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 224 THURSDAY 17th NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# ఆంధ్రరాష్ట్ర తక్షణ నిర్మాణం : కాంగ్రెస్ కార్యవర్గ సిఫార్సు

## "ఇండియాకు ఇచ్చే స్టర్లింగ్ బాకీల విడుదల ఆపము"

### కామన్సులో బ్రిటిష్ ఖజానాశాఖా కార్యదర్శి ప్రకటన: కన్సర్వేటివ్ ల విమర్శ

లండను, నవంబరు 15: "ఇండియా మొదలైన దేశాలకు బ్రిటన్ చెల్లించవలసిన స్టర్లింగ్ బాకీల విడుదలను నిలిపివేయాలన్న స్వార్థపూరితమైన నిర్ణయాన్ని బ్రిటిషుప్రభుత్వం ఎప్పటికీ చేయదు." అని బ్రిటిషు ఖజానాశాఖ కార్యదర్శి గ్లెన్విల్ హాల్ నేడు కామన్సులో ప్రకటించాడు.

ఇండియా స్టర్లింగు బాకీల విడుదలనూ, అమెరికాతో ఇండియా జరిపిన ఆర్థిక సంప్రదింపులనూ విమర్శిస్తూ కన్సర్వేటివ్ సభ్యుడు బ్రాన్ జెట్ ఐర్ వేసిన ప్రశ్నలకు సమాధానమిస్తూ గ్లెన్విల్ హాల్ పై ప్రకటన చేశాడు.

అమెరికాతో ఇండియా జరిపిన ఆర్థిక సంప్రదింపులవల్ల స్టర్లింగ్ ప్రాంత డాలర్ నిధికి నష్టమేమయినా వచ్చిందా అని పై కన్సర్వేటివ్ సభ్యుడే ప్రశ్నించగా ఖజానామంత్రి క్రిప్స్ అటువంటి నష్టమేమీ లేదని వెల్లడించాడు. ఇండియా మాంగనీస్ ఎగుమతులవల్ల సంపాదించే డాలర్లన్నీ స్టర్లింగ్ ప్రాంత డాలర్ నిధికి జమకావలెనా అని అతడు అడగ్గా, ఆడాలర్లన్నీ డాలర్ నిధికి జమజరిగిన ఫలితమే రాగలదని క్రిప్స్ జవాబిచ్చాడు. క్రిప్స్ సమాధానాలు సంతృప్తికరంగా లేవని బ్రాన్ జెట్ ఐర్ భావించటంవల్ల చర్చ బలాబలుత్తేజరించింది. ఈ చర్చలో ఖజానాశాఖ కార్యదర్శి హాల్ మొదట వివరించి ఉద్ధ ప్రకటన చేశాడు.

#### కన్సర్వేటివ్ వాదం

బ్రాన్ జెట్ ఐర్ చర్చను ప్రారంభిస్తూ ఈక్రింది విమర్శలు చేశాడు:

"స్టర్లింగ్ బాకీలసమస్యను పరిష్కారం చేస్తామని ప్రభుత్వం మాటలతోపొద్దు పుచ్చుతున్నదేగాని క్రియ ఏమీ చేయటంలేదు. కిందటి సంవత్సరమూ, ఈ సంవత్సరమూ ఇండియా మాంగనీస్ ఎగుమతులవల్ల సంపాదించిన డాలర్లను స్టర్లింగ్ ప్రాంత డాలర్ నిధికి జమకట్టటానికి బదులుగా ఇండియా సొంతఖర్చులకే బ్రిటిష్ ప్రభుత్వం వదలివేసింది. అంతేకాక స్టర్లింగ్ బాకీలనుండి ఎంతో పెద్దమొత్తాలను ఇండియాకు విడుదలచేస్తున్నది. ఇదిఎంత మాత్రం సబబు కాదు.

#### మరొకసారి పౌనువిలువ తగ్గింపు

పౌను మారకపు విలువను మళ్ళీ ఒకసారి తగ్గించాలని ఆలోచిస్తున్నారా అని నేను ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. ఎందుకంటే యుద్ధపు ఖర్చులని చెప్పవలసిన స్టర్లింగ్ బాకీలకింద ఇండియన్లకూ పశ్చిమ ఆసియనులకూ, మిగిలినవాళ్ళకూ పెద్దపెద్ద మొత్తాలు చెల్లిస్తున్నంతకాలమూ బ్రిటిష్ ప్రభుత్వం స్టర్లింగ్ విలువను కాపాడలేదు. పశ్చిమాసియా సైన్యాలకోసం మనం 8 మిలియన్ల పౌన్లను చెల్లించాలి. అయితే ఆ సైన్యాలమీద యూనియన్ పరికరాలను అందించి ఉంచకపోతే పశ్చిమాసియా ఈనాడు స్వతంత్రంగానే ఉండేదికాదు."

లేబర్ సభ్యుడు స్టాన్లీ ఇవాన్స్ మాట్లాడుతూ ఇండియావంటి బీదదేశాలు తాము న్యాయంగా రావాలని అనుకుంటున్న బాకీలను రద్దుచేయటానికి అంగీకరించవనీ, బ్రిటన్ ఆ దేశాలకు బుణపడి ఉన్నందువల్ల వాటిని కప్పిపెట్టకూడదని అన్నాడు. మరొక లేబర్ సభ్యుడు స్టాలిన్ ఇవాన్సును సమర్థిస్తూ ఇండియాకు స్టర్లింగ్ బాకీలు చెల్లించవలసినదేనని అన్నాడు. బ్రిటనుకు విదేశాల్లోగల ప్రతిష్ఠను పాడుచేసి, ప్రస్తుతసోషలిస్టు ప్రభుత్వాన్ని నాశనం చేయాలని కన్సర్వేటివ్ లూ, పెట్టుబడిదారులూ చేస్తున్న పన్నాగమే ఈ ఆరోపణలకు కారణమని విమర్శించాడు.

చర్చకు సమాధానమిస్తూ ఖజానాశాఖ కార్యదర్శి హాల్ స్టర్లింగ్ బాకీలవిడుదల [illegible] సొంతం బ్రిటిష్ ప్రభుత్వం [illegible] నొక్కిచెప్పాడు.

"స్టర్లింగ్ ప్రాంతమన్నది ఒక సన్నిహితసంఘం. అందులో సభ్యులకు స్వాతం-

త్యం ఉన్నది హక్కులూవున్నవి. బ్రిటన్ తనసొంత కష్టాలవల్ల బాకీలు చెల్లించనని ఇప్పటికీ అనలేదు. ఇండియా మొదలైన దేశాలకు ఈ బాకీలవసూలు అత్యవసరంగా ఉన్నది. తమపరిస్థితులను కనిపెట్టవలసినదని ప్రధాని అట్లీ, ఖజానామంత్రి క్రిప్స్ మొదలైనవాళ్లు ఆదేశాలకువిజ్ఞప్తిచేస్తూనే ఉన్నారు.

ఇండియా అమెరికాతో సంప్రదింపులు జరపటంలో తప్పేమీలేదు. వెస్ట్ మినిస్టర్ చట్టాన్ననుసరించి అధినివేశాలన్నిటికీ ఇష్టంవచ్చినదేశాలతో ఒప్పందాలు చేసుకునే అధికారం ఉన్నది. ఈ విధంగా కామన్వెల్తుదేశాలను చీలగొట్టాలని ప్రతికూలపక్షం ఎంత ప్రయత్నించినప్పటికీ ఇండియా ఇంకా కామన్వెల్తులోనే ఉన్నది. ఇకముందుకూడా ఉండగలదు.

## మద్రాస్ ప్రభుత్వం, ఆంధ్ర, తమిళ కాంగ్రెస్ సూచనల ననుసరించి నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబరు 16: కాంగ్రెస్ కార్యవర్గం ఈ అపరాహ్ణం రెండుగంటలసేపు సమావేశమై నిర్వివాదమైన తెలుగుజిల్లాలతో మద్రాసు నగరం మినహాయిస్తూ ప్రత్యేకాంధ్రరాష్ట్రాన్ని నిర్మించడానికి భారత ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవలసిందని కోరుతూ తీర్మానించింది.

ఈ విషయమై ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్, తమిళనాడు కాంగ్రెస్, మద్రాసు రాష్ట్రప్రభుత్వము ఇటీవల ఆమోదించిన తీర్మానాలను కూడా అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గం పరిశీలించింది. నాయకత్రయ నివేదికానుసారంగా ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణానికి అందరి సుముఖభావం వున్నందువల్ల తక్షణమే అట్టి రాష్ట్రనిర్మాణానికి భారతప్రభుత్వం అవసరమైనచర్యజరపవలసిందని కోరడమవుతున్నది.

ఖచ్చితమైన సరిహద్దులను నిర్ణయించుటకు సరిహద్దు నిర్ణయ సంఘాన్ని నియమించవలెనని కూడా ఈ తీర్మానంలో కలదు.

భారత నూత్న రాజ్యాంగం లోని 1-వ షెడ్యూలులో ఆంధ్రరాష్ట్రంపేరును నమోదు చేయడానికి కావలసిన కార్యక్రమాన్ని జరపుటకు సాధ్యపడగలదని విశ్వసిస్తున్నది.

నిర్వివాదమైన ఈ క్రింది తెలుగు జిల్లాలతో రాష్ట్రం ఏర్పడగలదు. విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారిజిల్లాలోని ఆదోని, ఆలూరు రాయదుర్గం తాలూకాలు.

ఆంధ్రరాష్ట్రానికి ఏది రాజధానిగా వుండేదీ, ఇండియా ప్రభుత్వచట్టం లోని 290-వ సెక్షన్ క్రిందా నూత్నరాజ్యాంగంలోని 391-వ సెక్షన్ క్రింద గవర్నర్ జనరల్ రాష్ట్రనిర్మాణాన్ని ఆదేశిస్తూ చేసే ఉత్తర్వులోనే ఉదహరింపబడుతుంది.

### విమానాలకు నిరోధం

బొంబాయి, నవంబరు 16: వాతావరణం బాగులేనందున లండనునుండి బొంబాయి రావలసిన ఎయిర్-ఇండియా ఇంటరనేషనలువారి విమానం నేడు సాయంకాలం రావలసినది 24 గంటలు ఆలశ్యంగా రేపు సాయంకాలం వచ్చును.

## తుపాను భీభత్సంపై కాంగ్రెస్ కార్యవర్గ చర్చ

### 50 కోట్ల నష్టమని రాష్ట్రపతి డా॥ పట్టాభి వివరణ

న్యూఢిల్లీ, నవంబరు 16: కాంగ్రెసు వర్కింగుకమిటీవారు నేడు డా॥ పట్టాభిగారి అధ్యక్షతను పటేలుగారి గృహమందు సమావేశమయి $1\frac{1}{2}$ గంటలసేపు చర్చ చేసి తిరిగి మధ్యాహ్నము 3 గ॥ వరకు నిలుపుచేసిరి.

కమిటీవారు దేశంలోని పరిస్థితులన్నింటిని, ముఖ్యంగా యిటీవల తూర్పుతీరమున ఆంధ్రజిల్లాలలో బందరు, కాకినాడలమధ్య కలిగిన తుపాను నష్టంగూర్చి చర్చించినట్లు తెలియుచున్నది.

డా॥ పట్టాభి, ఆచార్యరంగా మున్నగు సభ్యులు ఆ ప్రాంతాలు చూచినవారు, ఐదురోజులు తుపానువలన అచట కలిగిన నష్టంగూర్చి కమిటీవారికి వివరంగా తెలియజేసిరి. మొత్తం 50 కోట్లు నష్టం వచ్చియుండునని అభ్యక్షులే అంచనా వేసిరి.

యావద్భారతదేశం అచటి ప్రజలకు సహాయం చేయవలసిందిగా కమిటీ వారొక విన్నపం ప్రకటింప దలచిరనియు, గవర్నరు సహాయనిధి స్థాపించబడునని యు దానికే చందా లిచ్చేవారంతా తమ చందాలు పంపవచ్చని తెలియజేతురు.

రాజ్యాంగపరిషత్తు సభలో వచ్చే ఖాళీలకు ఎన్నికలు పూర్తి చేయుటగూర్చి కూడా చర్చించిరనియు, రాజ్యాంగ చట్టం మూడవసారి చర్చ ముగిసిన తరవాత జరిపించుటకు నిశ్చయించిరనియు తెలియుచున్నది. అభ్యర్థుల నామినేషన్లు కేంద్ర రాష్ట్రకాంగ్రెసు సంఘములు చేయాలా లేక పార్లమెంటరీపార్టీలు చేయాలా రాష్ట్రప్రధానులు చేయాలా అన్న విషయం కమిటీవారు చర్చించుచున్నారు. చర్చ ముగియలేదు.

కాంగ్రెసు సభ్యులుగ రా. స్వ. సేవక సంఘం వారిని చేర్చుకొనుటను కొన్ని రాష్ట్రసంఘాలు, కాంగ్రెసు పెద్దలు విమర్శించినందున, ఆవిషయమై కమిటీవారు పునరాలోచన చేసిరనికూడా తెలియుచున్నది. (యు. పి.)

## కేంద్రప్రభుత్వ ఉత్తర్వులకు ఎదురుచూస్తున్నాము

### మద్రాస్ ప్రధాని కుమారస్వామిరాజా ప్రకటన

చెన్నపట్నం, నవంబరు 16: "నాయకత్రయ నివేదికను అంగీకరించుచును, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమునకు సమ్మతించుచునూ మద్రాసు మంత్రివర్గంవారు గావించిన తీర్మానము కాంగ్రెసు కార్యసంఘము వారికి పంపితిమి. నేడు వారు నిర్ణయము చేయనున్నారు. వారి నిర్ణయానంతరము కేంద్ర ప్రభుత్వంవారు చేయబోవు ఉత్తర్వులకు మేము ఎదురుచూచుచున్నాము." అని మద్రాసు ప్రభుత్వ ప్రధాని పూసపాటి కుమారస్వామిరాజాగారు నేడు పత్రికాప్రతినిధులసమావేశములో తెలిపిరి.

తీర్మానముతో పాటు రాష్ట్రనిర్మాణమునకు ప్రత్యేక సిఫార్సు ఏమైన చేసినారా అని ఆంధ్రపత్రిక ప్రతినిధి అడుగగా ప్రధాని తీర్మానం పంపుట తప్ప వేరు ఏమియూ చేయలేదనియూ, రాజగోపాలాచారిగారు ప్రధానిగా ఉన్నపుడు తీర్మానమును తోడు కొంత వ్రాసినందువల్ల పెద్ద గందరగోళము వచ్చెననిరి. ఇక వర్కింగు కమిటీ నిర్ణయం రావలసి ఉన్నదనిరి.

ఆంధ్రదేశంలో తుపానువల్ల నష్టపడిన ప్రాంతాల చూచివచ్చెదరా అని అడుగగా కొందరు మంత్రులు వెళ్లివచ్చినారనియూ, రెవెన్యూ ఆర్థికమంత్రులు అసెంబ్లీ సమావేశానంతరం వెళ్లెదరనియూ ప్రధాని తెలిపిరి. అధికంగా గ్రాంటులు ఏమైనా ఇచ్చినారా అనగా ప్రత్యేకమింత మొత్తమని గాక ఎంత అవసరమని అధికారులు చెప్పుచుండిన అంతనూ వెచ్చించుచున్నామని ప్రధాని సమాధానమిచ్చిరి. ఆంధ్రదేశంలో అతివృష్టివల్ల అరవదేశంలో అనావృష్టివల్ల ఈసాలు గడ్డుగా నుండవచ్చు. ఎరువులు వెంటనే సరఫరా అగు అవకాశంలేనందున మదరాసుప్రభుత్వ సస్యాభివృద్ధి కార్యక్రమము మార్చాలెనని ఆర్. కె. పటిల్ గారు సూచించినారనియూ, మంత్రివర్గంవారు ఈ విషయమును చర్చించెదరనిరి. ఈ రాష్ట్రములో అధికముగా పండించవలసిన భూమిలేదనియూ, అందువలన రాజకీయ బాధితులకు భూములుఇచ్చుటకు తావులేక చిక్కుగా ఉన్నదనిరి. కోయంబత్తూరు జిల్లాలో పదివేలమంది బాధితులు ఉన్నారు కాని ఉన్నకొంచెం, అడవులుఅన్నీ కలిపి మూడువేల మందికన్న ఇచ్చుటకు భూమి కనిపించుటలేదనిరి.

మంత్రులపై ఆరోపణలకథ ఇక తేల్చవలసినది కాంగ్రెసు అధిష్ఠానవర్గము వారేననియూ, తమకు ఆపని తీరిపోయెననియు చెప్పిరి.

## "పాతవలస విధానం ఏమాత్రం పనికిరాదు"

### వెనుకపడిన దేశాల అభివృద్ధి: నీగ్రో మహిళా సభలో ట్రూమన్ ఉద్బోధ

వాషింగ్టన్, నవంబరు 15: దళితదేశాల అభివృద్ధికి పాతకాలపు వలసలవిధానాలు ఎంతమాత్రం దోహదం కల్పించలేవని నేడు ట్రూమన్ సభాపతి స్పష్టంగా ప్రకటించారు.

ఆ విధానాలలో రాజకీయంగా బానిసత్వమూ, ఆర్థికంగా దోపిడీపద్ధతి ఇమిడివున్నాయని, అందువల్ల అవి ఎందుకు కొరగాకుండా పోయినాయనికూడా ఆయన అన్నారు.

ట్రూమన్ సభాపతి అమెరికన్ నీగ్రో మహిళా సమావేశంలో మాట్లాడుతూ ఈ మాటలు చెప్పారు.

తదక్రింప అమెరికాప్రభుత్వం నీగ్రో జాత్యుద్ధరణకు పూనుకుంటుందని ఆయన ఈ సందర్భంలో వారికి హామీ ఇస్తూ, నీగ్రోలకు సమానహక్కులు, సమానావకాశాలు కల్పించడం జరుగుతుందని అన్నారు.

స్వయం పాలనకోసం ప్రపంచంలో బహు ప్రాంతాల్లో జరుగుతున్న ఉద్యమాలను గూర్చి మాట్లాడుతూ అందువల్ల బాగా అభివృద్ధిలోవున్న దేశాలకుగూడా మంచి మేలు జరుగుతుందని ఆయన చెప్పారు.

కౌలాలంపూర్, నవంబరు 13: మలయా మొత్తంలో నిర్బంధింపబడిన 5512 మందిలోను 249 మంది భారతీయులు వున్నారు.

### కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సభ

లండన్, నవంబరు 15: రాబోవు సంవత్సర ప్రారంభమున కొలంబోలో కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సభ జరుగును. ఈ సభకు రావలసినదిగా పంపబడిన ఆహ్వానమును బ్రిటన్ అంగీకరించినదని విదేశాంగ కార్యాలయ ప్రతినిధి నేడు చెప్పెను.

జపానుతో సంధిచేసికొనుటకును, చైనీస్ కమ్యూనిస్టు ప్రభుత్వమును అంగీకరించు విషయమై నిర్ణయము గావించుటకును ఈసభ జరుగనున్నది.

## తుపాన్ బాధితులకు ఉదారసహాయం చెయ్యండి

### భారతప్రధాని నెహ్రూ ఉద్బోధ

న్యూఢిల్లీ, నవంబర్ 16: ఇటీవల తుపానుదెబ్బతిని కష్టాలనూ ఇబ్బందులనూ ఎదుర్కొంటున్న ఆంధ్ర రాష్ట్రం లోని కొన్ని జిల్లాల ప్రజలకు భారతీయులందరు సహాయపడాలని హెచ్చరిక చేస్తూ భారత ప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఈక్రింది ప్రకటన చేశారు:

"నేను ఇండియాకు తిరిగి వస్తూనే తుపానువల్ల ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాలకు ఇటీవల తగిలిన నష్టాన్నిగురించి విని చాలా ఖేదించాను. కర్నూలు, గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలకూ మరి కొన్ని ప్రాంతాలకూ నష్టం కలిగింది. అధికమైనవర్షమువల్లా, కొండవాగుల పొరలడంవల్లా, ఉప్పెనవల్లా, తుపానువల్లా ఈ నష్టం జరిగింది. అనేకవేల మందిస్త్రీలు, పురుషులూ నీటిలో మునిగిపోయినారు. అనేక దశసహస్రాల పశువులు కొట్టుకొనిపోయినవి. అసంఖ్యాకములైన ఇళ్ళు కూలిపోయినవి.

"దక్షిణదేశానికి ధాన్యపు గిడ్డంగులుగా భావించబడే కృష్ణా, గోదావరి జిల్లాలకు అపారనష్టం జరిగింది. ఆ ప్రాంతాలకు పైనుంచి ఆహారం అందించవలసి ఉంటుంది.

"ఈ పరిస్థితి చక్కజేయడానికి మద్రాసు ప్రభుత్వం చర్యలు తీసుకొంటున్నారుగాని ఇంతగొప్పనష్టం యావద్భారత సహకారంతోగాని తీరబోదు. ప్రస్తుతం రవాణాసమస్య క్లిష్టంగా ఉండడంచేత ప్రస్తుత బాధలు ఆహారసమస్య పరిష్కారం కావలసిఉన్నది. సర్వనాశనమైపోయిన ఈ ప్రాంతాలకు ఇండియా అంతటినుంచి సహాయం లభిస్తుందని ఆశిస్తున్నాను. ఈ ప్రాంతాలను పునరుద్ధరించే నిమిత్తం విరాళాలను మద్రాసుగవర్నరుకు పంపగలరు. లేదా ఆంధ్రకొరకు ప్రధానిపేర సాగించబడిన సహాయనిధికి పంపవచ్చును."

#### ఆకస్మిక మరణం

సర్జను జనరలు ఆఫీసులో అడ్మినిస్ట్రేటివు ఆఫీసరుగ 1 వ తేదిన చార్జి పుచ్చుకున్న సి. జి. రంగనాథ మొదల్యారు నిన్న టిరోజున కడుపునొప్పని చెప్పి ఆఫీసులోనే చికిత్స అందెలోపున చనిపోయెను వయస్సు (50).

### తుపాన్ బాధితులకు నెహ్రూ విరాళం

#### 25 వేల రూపాయలు

న్యూఢిల్లీ, నవంబరు 16: ఆంధ్రదేశంలో తుపాను బాధితుల సహాయార్థం పండిట్ నెహ్రూ నేడు 25 వేల రూపాయలకు ఒక చెక్కును మద్రాసు గవర్నరుకు పంపించారు.

భారత ప్రధాని పేరిట ఏర్పరచబడ్డ జాతీయ సహాయనిధిలోనుండి ఈ మొత్తం ఇవ్వబడుతుంది.

### గవర్నరు జనరలు విరాళం

మద్రాసు, నవంబరు 16: ఆంధ్రదేశంలోని తుపానుబాధితుల సహాయార్థం మద్రాసు రాష్ట్ర సహాయనిధికి భారత గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారి 10 వేల రూపాయలు విరాళం ఇచ్చారు.

### మిల్లువస్త్రాల ధరల తగ్గింపు

#### కంట్రోల్ వస్తువుల డైరెక్టర్ వివరణ

మదరాసు, నవంబరు 16: కంట్రోలు వస్తువుల డైరెక్టరు ఎం. శివరామన్గారు ఇట్లు ప్రకటించుచున్నారు:

ఇండియా ప్రభుత్వంవారు మిల్లువస్త్రాలపై మిల్లువద్ద ధరపై అదనంగా 20% వంతుగాక 14% వంతుమాత్రమే విక్రేతలు 31-10-49 తరువాత తయారయిన వస్త్రాలపై వసూలుచేయాలని, నిర్ణయించినందున, మదరాసు రాష్ట్రమునందు మిల్లులలో తయారయిన వస్తువులకు, బొంబాయి మిల్లులలో తయారయిన వస్త్రాలకుకూడా యీ నియమం యీ రాష్ట్రంలో వర్తించును. అంతకుమించి విక్రయించరాదు.

## రెండు విమానాలు ఢీకొని ప్రమాదం

### కలకత్తాలో సంఘటన: 15 మందికి గాయాలు

కలకత్తా, నవంబర్ 16:—కలకత్తాలో విన్యాసాలు జరుపుతున్న రాయల్ భారత విమానదళానికి చెందిన రెండు విమానాలు హఠాత్తుగ భూపతితాలైనాయి.

ఇందులో ఒకటి చిత్తరంజన్ ఎవెన్యూ ప్రాంతంలోవున్న మెడికల్ కాలేజీ దగ్గర పడిపోయింది. రెండోది అప్పర్ కలకత్తా రోడ్డుదగ్గర వున్న ట్రాం డిపో దగ్గర కూలింది.

మొదటి విమానాన్ని నడుపుతూవున్న సారథి విమానంపడగా లేచిన మంటలలో కాలిపోయినాడు. రెండో విమానాన్ని నడుపుతూన్న అతను పడుతూవున్న విమానంలోంచి దూకి ప్రాణాలు రక్షించుకున్నాడు.

ఇందువల్ల దాదాపు 15 మంది గాయపడినట్లు ఇంతవరకు తేలింది. వీరిలో మెడికల్ కాలేజీలో కూలి నాలి చేసుకు జీవించేవారు గూడా కొంతమంది వున్నారు. వీరి నందరిని హాస్పటలులో చేర్చారు.

అసలు ఈ విమానాలు ఎట్లా ఇటువంటి విపత్తులో చిక్కుకొన్నది ఇప్పటికీ వచ్చిన వార్తలవల్ల ఈ విధంగా తెలుస్తున్నది.

ఈ విమానాలు రెండుగూడా రాయల్ భారత విమానబలం తాలూకు తూర్పు ఇండియా దళానికి చెందినవి. పతాకప్రదర్శన విన్యాసాలు చేసేనిమిత్తం కలకత్తాకు వచ్చాయి. ఈవిపత్తు సంభవించకుండా వుంటె ఇవాళ్ళనే అస్సాంకు పోయి వుండేవి.

ఈ రెండు విమానాలు ఆకాశం ఎగురుతూ ఒకదానిని ఒకటి ఢీకొని క్రిందకు పడిపోయినాయి. భూమిమీద పడీనటు వాటి రెండింటిలోంచి మంటలు లేచాయి.

ఈ విధంగా ఒకదానితో ఒకటిఢీకొనగా అందులో ఒకవిమానం మెడికల్ కాలేజీ ఆవరణలో వున్న ఒకభవనంగోడకు కొట్టుకుంది. ఇంకొకటి అప్పర్ కలకత్తా రోడ్డుమీదవున్న ట్రాండిపోదాకాపోయి, అక్కడవున్న విక్టోరియా బాలికా పాఠశాలలో పనిచేసే వాంఛ్రకని ఏర్పాటు వున్న ఇంటికి కొట్టుకుంది. ఇది మెడికల్ కాలేజీకి ఒక మైలుదూరంలో వుంది.

భారత్ బ్యాంక్
లి॥.
హెడ్ఆఫీసు: ఢిల్లీ
చెల్లించిన మూలధనం
రు 2,01,37,175
రిజర్వు ఫండు
రు 40,00,000
మీ ప్రదేశంలోని మా ఆఫీసు
వారు మీ బ్యాంకింగ్ సమస్య
లను సంతోష పూర్వంగా
తీర్చెదరు
BB
దేశమంతటా బ్రాంచీలు కలవు



ప్రతి దినము
ప్రతి మార్గమున
మీకు అవసరము
'ఎవరెడీ'
ఫ్లాష్‌లైట్ బ్యాటరీలు.
EVEREADY
Fresh Power
BRIGHTER LIGHT
LONGER LIFE
ప్రపంచమంతటికి
మిక్కిలి ఆధారపడదగిన
బ్యాటరీలు ఇవే.
EVEREADY
TRADE-MARK
ఫ్లాష్‌లైట్ బ్యాటరీలు
నేషనల్
కార్బన్ కంపెనీలో తయారైనవి


# ఆంధ్రరాష్ట్రం విషయమై రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానం

## రాష్ట్రపతి ప్రభృతుల రాజనీతి నైపుణ్య ప్రశంస

విజయవాడ, నవంబరు 14 : పంద్రంగి కేశవరావుగారి అధ్యక్షతను నిన్న నిక్కడ జరిగిన ఆంధ్రమహాసభ స్థాయిసంఘసమావేశములో ఈక్రింది తీర్మానములు చేసిరి.

ఆంధ్రరాష్ట్రం విషయమై ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు, అందు ముఖ్యంగా ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశంపంతులు, ప్రొఫెసరు రంగాగార్లును అసామాన్యమైన రాజకీయచతురత చూపినందుకును, గా॥ నీలం సంజీవరెడ్డి, రాయలసీమ మహాసభాధ్యక్షుడు ఎం. కె. వి. రెడ్డిగార్లున్ను ఇతర రాయలసీమ నాయకులను కష్టసమయములో నైనను ఏకకుటుంబీకులము అని స్థిరపరచి ఆంధ్రప్రజానీకానికి ఆశలు పెంచినందుకు వందనాస్యులనీ, ఈ సందర్భంలో ఆంధ్రప్రజానీకాన్ని ఒగ్గుచేర్చిన మహనీయుడు మహావ్యక్తి, నిఖిలప్రపంచంలోకెల్ల పెద్ద సమైక్యజాతికి చిహ్నమయిన భారత జాతీయ కాంగ్రెసుకు అధ్యక్షుడు, నవీన ఆంధ్రోద్యమమునకు మూలపురుషులైన బందరు జాతీయవాదులలో పితామహుడు అగ్రగణ్యుడు, విశేషసర్వతోముఖ ప్రజ్ఞాధురంధరుడు, శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారికిన్ని వారియందను విశేషప్రజ్ఞనుపయోగించి పార్టీభేదములను సమయింపజేసి 11 వ తేదీన ఏకగ్రీవ ఆంధ్రరాష్ట్రతీర్మానమునకు కారకుడైన భారత కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారికిని జోహార్లర్పించడమైనది.

ఆంధ్రజిల్లాలందు తుపానుబీభత్సముచే కలిగిన అల్లకల్లోల అపత్సమయములో పర్యటించలేపోవుటయేగాక పత్రికల వార్తలు అతిశయోక్తులన్న మద్రాసు ప్రధానిని గర్హించడమైనది.

తుపానుబాధితుల సహాయార్థము ఎన్ని సహాయసంస్థలకైనను తావుగలదు గనుక వారిసహాయార్థము కాట్రగడ్డ మాధవరావు (చైర్మన్) గాదిరాజు వెంకటేశ్వరరావు (కోశాధ్యక్షుడు) నల్లూరి పాపయ్య, నడింపల్లి లక్ష్మీనరసింహరావు, నల్లాన్ చక్రవర్తుల నరసింహాచార్యులు, బయన వీరరాఘవయ్యగుప్త, ప్రకాశ చంద్ర శతపథి, ముక్తివిశ్రీ రంగాచార్యులు పంద్రంగి కేశవరావు (కన్వీనరు) గార్లతో ఉపసంఘము నేర్పరచి, వారిని విరాళములు సేకరించ వలసినదిగా ఆదేశించడమైనది.

నూతన ఆంధ్రరాష్ట్రమునందు అవిద్యను రూపుమాపుటకును, వయోజన విద్యాప్రచారమును విరివిగా సాగించుటకును ఆంధ్రదేశములో పూర్వము వెలసిన రాత్రి పాఠశాలలను పునరుద్ధరించుటకును వారము నకు మూడురోజులు సంచార పాఠశాలలో ప్రాథమిక విద్యమీద భూగోళము, చరిత్ర ప్రాథమిక ప్రకృతి శాస్త్రములమీద తేలిక ఉపన్యాసములతో గ్రామవిద్యాబోధన కార్యక్రమమును సాగించుటకును, నిరక్షరాస్యతను నిర్మూలించుటకును పంద్రంగి కేశవరావు (చైర్మన్) మానికొండ కుటుంబరావు, (కన్వీనరు), అయ్యంకి వెంకటరమణయ్య, ప్రకాశచంద్ర శతపథి, ముక్తివిశ్రీరంగాచార్యులు గార్లతో ఉపసంఘమును ఏర్పాటు చేయడమైనది. ఆంధ్ర మహాసభపట్టణ, జిల్లాశాఖలను స్థాపించుటకు ద్రోణంరాజు రామచంద్రరావు (చైర్మన్), కోదూరి లక్ష్మీపతిరావు, గుంటూరు రాజు, ఎస్. నారాయణాచారి వి. సదానందమూర్తి (కన్వీనరు) గార్లతో ఉపసంఘమును ఏర్పాటు చేయడమైనది.

రాజ్యాంగ పరిషత్తు మూలలను భర్తీ చేయు ఎన్నికలలో ఇంగ్లీషు హిందూస్థానీ భాషలలో ఆరితేరినవారిని, విద్యావంతులను, ఆంధ్రులకు ఫెడరల్ ప్రభుత్వములో ఉద్యోగములలో తగిన ప్రాతినిధ్యము తెప్పించగల సమర్థులను నియమించవలెనని ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘమువారిని కోరడమైనది. విజయవాడకు విమానసర్వీసు ఆగిపోయినందున మద్రాసు నుంచి ఢిల్లీ కలకత్తాలకు పోవు విమానములు ఇక్కడ ఆపుచేసే ఏర్పాటు చేయవలెనని భారత ప్రభుత్వమును కోరుటకు భారత ప్రభుత్వ [illegible] మంత్రిత్వ శాఖకు ఒక [illegible] సంప్రదించ నిశ్చయించడమైనది. [illegible] ఏర్పాటు చేయుటకు కోదూరి [illegible] [illegible] (చైర్మన్) కాట్రగడ్డ మాధవరావు, నల్లూరి పాపయ్య పంద్రంగి కేశవరావు (కన్వీనరు) గార్లతో ఉపసంఘము ఏర్పాటు చేయడమైనది. బందరు-గుంటూరు [illegible] రైలు మార్గమును [illegible] చేయవలెనని కూడా తీర్మానములో కోరడమైనది.

అధ్యక్షవిందులో సభ ముగిసెను.

## తిరుత్తని తాలూకా ఆంధ్రములోనిదే

### పెరుమాళ్రాజుపేట పంచాయతీ తీర్మానం

తిరుత్తని, నవంబరు 14: ఈ తాలూకా పెరుమాళ్రాజుపేట పంచాయతీబోర్డు ప్రత్యేక సమావేశం నిన్న కంచి మునసామి సెట్టిగారి అధ్యక్షతను సమావేశమై యీ క్రింది తీర్మానములను కావించినది.

"ఆంధ్ర తమిళరాష్ట్ర విభజన సంబంధమున కొందరు తమిళనాయకులు తిరుత్తని తాలూకాను తమిళరాష్ట్రములో చేర్చవలయునని చేయు అకారణ ఆందోళనములను తీవ్రముగా ఖండించుచు ప్రస్తుతము తిరుత్తని తాలూకాకు చెందిన గ్రామాదులు మాత్రము కాకుండా చుట్టుపట్లనున్న మరికొన్ని యితర తాలూకా గ్రామాదులనుగూడ ఆంధ్రరాష్ట్రములో నె చేర్చవలయుననియు, తిరుత్తని తాలూకా యందు తమిళులకు అణుమాత్రము గూడా హక్కు లేదనియు యీ బోర్డువారు యేకగ్రీవముగా తీర్మానించుచున్నారు."

బహిరంగసభ

పెరుమాళ్రాజుపేట గ్రామములో నె నిన్న సాయంత్రం గొప్ప బహిరంగసభ యొకటి తిరుత్తని తాలూకా కాంగ్రెసు కార్యదర్శి వక్కల బాలయ్యసెట్టిగారి యాజమాన్యమున జరిగినది. ఆ సభలో ఆంధ్రరాష్ట్రము సరిహద్దు సమస్యలను గూర్చి పలువు రుపన్యసించుచు, తమిళుల వాదమును ఖండించిరి. తిరుత్తని తాలూకా ఆంధ్రరాష్ట్రమునకే చేరవలెను గాని ప్రత్యేకించి తమిళరాష్ట్రమున చేర్చరాదని తీర్మానించిరి. (స్వ. వి.)

## కార్యనిర్వాహకాధ్యక్షుని ఆమోదం

హిందూపురం, నవంబరు 13: ఆంధ్ర మహాసభ కార్యనిర్వాహకాధ్యక్షుడు గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారిట్లు వ్రాసిరి. మిత్రుడు రంగాగారి ప్రతిభావంతమగు నాయకత్వమున ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు నాయకత్రయ నివేదికను అంగీకరిస్తూ, ఆంధ్రరాష్ట్ర నిర్మాణవిషయమై అవలంబించిన వైఖరి, వారి సమయోచిత స్థయిర్యమును, శాంతియుతమగు చిత్తప్రవృత్తిని, విజ్ఞతను ప్రదర్శించుచున్నది. దీనికై నేను ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సభ్యులను అభినందించు చున్నాను. బహుక్లిష్ట మొనర్చబడిన ఈసమస్య ఇట్లు సుగమమున పరిష్కారమగుటకు ముఖ్యముగ శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు సుముఖులగుట నాకు సంతసము గల్గించుచున్నది ప్రకాశంపంతులుగారు, నాయకత్రయ నివేదికనంగీకరిస్తూ తీర్మానమును ప్రతిపాదించడము, ఆంధ్రరాష్ట్రము తక్షణం ఏర్పాటు కావలయునని కోరు ఆంధ్రుల ఏకీభావమును నిరూపించుచున్నది. ఏ ఆంధ్ర రాష్ట్రసిద్ధి ఇప్పుడు నిజమైనదో, దాని భాగ్యాభివృద్ధికై ఆంధ్రదేశంలోని మన మందరము ఐక్యముగా కృషిచేయుదము గాక.

వ॥ విశాఖజిల్లా కాం. సంఘాధ్యక్షులు పసుమర్తి వీరభద్రస్వామి, కార్యదర్శి మిస్సుల సూర్యనారాయణ మూర్తిగార్లు ఇటుల వ్రాయుచున్నారు:—

ఈ సారి బెజవాడలో దుర్గాకళామందిరములో సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సమావేశము చరిత్రాత్మకమైనది. ఆంధ్రులలో ఎన్నడు కనివిని ఎరుగని ఐక్యత కానవచ్చినది. ఆంధ్రరాష్ట్రము విషయములో చేసిన తీర్మానమువల్ల, మరొకసారి ఆంధ్రుల కార్యకౌశల్యము తేటతెల్లమైనది. ఆంధ్రులలో కలిగిన యీ ఐకమత్యము ఆంధ్రరాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికై ఉపయోగించుగాక యని ఆశించుచున్నాము. ఈ ఐకమత్యము నిలుచుగాక!

### నాగపూరు ఆంధ్రవిద్యార్థి సమాఖ్య తీర్మానం

నాగపూరు, నవంబరు 14: స్థానిక ఆంధ్రవిద్యార్థి సమాఖ్యవారు నిన్న సమావేశమై ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం, జె. వి. పి. రిపోర్టుపై చేసిన తీర్మానాన్ని సంపూర్తిగా బలపరుస్తూ, యే పరిస్థితిలోనూ మద్రాసునగరం అరవనాడుకు చెందకుండా, ఆ నగరాన్ని ప్రత్యేక రాష్ట్రంగా యేర్పరుచుటకు, తమ నిశ్చితాభిప్రాయాన్ని తెలియపరుస్తు తీర్మానించారు.

## రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానాంతరార్థం

### భక్తవత్సలంగారి ప్రకటనకు విశ్వనాథంగారి జవాబు

చెన్నపట్నం, నవంబరు 16: నేను నాయకత్రయ నివేదికపై అసెంబ్లీలో మంత్రి భక్తవత్సలంగారు చేసిన ప్రకటనను ఖండిస్తూ శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు ఆంధ్రపత్రికకు ఈ ప్రకటన చేస్తున్నారు:

"రాష్ట్ర కాంగ్రెసువారి తీర్మానము అర్థంవిషయమై మద్రాసునుండి శ్రీ ప్రకాశంగారు చేసిన ప్రకటన సరియైనదే. ఈ తీర్మానంలో నివేదికయున్నూ, చెన్నపట్నాన్నిగూర్చి రాష్ట్రపతిగారు ఈ మధ్య చేసిన నిర్వచనమున్నూ రెండున్నూ కలిపి యోచించి చెన్నపట్నం ప్రత్యేక రాష్ట్రంగా ఉన్నట్లయితే తెనుగువారి యొక్క కోరిక కొంతవరకు నెరవేరినదని ఊహించి 12 తెలుగుజిల్లాలూ ఒక రాష్ట్రముగానున్నూ, చెన్నపట్నం ప్రత్యేక రాష్ట్రముగానున్నూ నిర్మించుటకు రాష్ట్ర సంఘంలో తీర్మానం చేయబడినది.

తీర్మానముయొక్క మొదటి భాగము ఉపోద్ఘాతమనిన్నీ, నాయకత్రయ నివేదికను అంగీకరించిన భాగమే తీర్మానమనిన్నీ కొందరు అర్థముచేసుకొని ఏవిధమైన షరతూ మార్పూ లేకుండా ఆ నివేదికను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారు ఆమోదించారని కొందరు చెబుతున్నారు. ఈ రోజున శాసనసభలో ఒక మంత్రిగారు కూడా ఆ విధంగాఅన్నారు. అయితే ఇది పొరపాటు. ఉపోద్ఘాతమనే భాగమందు మనఊహను విపులీకరించి, తర్వాత భాగమును, 'కనుక' అనేమాటతో ఆరంభించి ఉన్నారు.

ఈ 'కనుక' నిరర్థకంగా వాడలేదు. ఇంగ్లీషుపాఠంలో 'దెర్ ఫోర్' అనే మాటతో ఆ భాగం ఆరంభింప బడింది. అయితే ఈ విధంగా వ్యాఖ్యానం చేసినట్లయితే ఆంధ్రరాష్ట్రం సనకబడిపోతుందేమోనని కొంతమంది అంటున్నారు. కాని నాకా భయంలేదు. కాంగ్రెసు జనరల్ సెక్రటరీగారైన శ్రీ కళా వెంకట్రావుగారు ఈ తీర్మానాన్ని ఏ విమర్శా లేకుండా సంపూర్ణంగా ఆమోదిస్తూ సభలో ఉపన్యసించారు. వర్కింగ్ కమిటీవారు దీన్ని అపార్థంచేసుకొని నాయకత్రయ నివేదికను కూడా అపార్థంచెప్పి చెన్నపట్నంలో తెనుగువారు ఉండటానికి ఆస్కారమే లేదని చెప్పి, అది మనం ఒప్పుకోనందుకు రాష్ట్రం నిర్మాణం [illegible] అంటే అననివ్వండి. ఇన్నాళ్లు ఆగిన వాళ్ళం మరో ఏడాదిపాటు ఆగగలము. వద్దన్నప్పటికే కూడా ఈ ఆంధ్రరాష్ట్రం ఒక ఏడాది రెండేళ్ళలో రాక తప్పదు. అటువంటప్పుడు తొందరపడి చెన్నపట్నంలో నిలచుటకైనా మనకు హక్కు లేదని మనమే ఎందుకు అనుకోవాలి.

కాని మొదట నేను చెప్పినట్లుగా రాష్ట్రకాంగ్రెసువారు చేసిన తీర్మానం శ్రీ పట్టాభిగారి నిర్వచనాన్ని పురస్కరించుకొని ఉన్నది. కనుకను, శ్రీ కళా వెంకట్రావుగారు సంపూర్ణంగా ఆమోదించుట చేతనున్నూ ఆ తీర్మానం నాయకత్రయ నివేదిక అభిప్రాయానుసారమే ఉన్నదనిన్నీ ఆ అభిప్రాయంలో ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం చెన్నపట్నం ప్రత్యేకరాష్ట్రం అన్న భావం ఇమిడి ఉన్నదనిన్నీ ఆ కారణంచేత ఇతర భాషా ప్రాంతాలనుండి వత్తిడిలేకున్నట్లయితే ఈ జనవరి 26 వ తేదీలోపునే మనరాష్ట్రం నిర్మాణమునకు కావలసిన ఏర్పాట్లు జరుగగలవని విశ్వసిస్తున్నాను.

మద్రాసు ప్రభుత్వంవారు గాని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారు గాని, చెన్నపట్నం తమిళనాడుయొక్క అంతర్భాగమని ఎన్నడూ ఒప్పుకొనలేదు. ఒప్పుకున్నారని ఎవరైనా చెప్పినట్లయితే అది కేవలమున్నూ వారి సంతోషమే, చెబుతున్నారని నమ్మవలసి ఉంటుంది. చెన్నపట్నంగవర్నమెంటువారు ఏమి వ్రాసింది ప్రకటిస్తే ప్రజలు సంతోషిస్తారు. మంత్రులు మాత్రం తోచినట్లు ఉపన్యాసాలు ఇవ్వడం మానివేస్తే ప్రజలు ఇంకా సంతోషిస్తారు. [illegible] కమిషను వారికి చెన్నపట్నం విషయమై ఏమిచేసినప్పటికీ చెయ్యవచ్చుగాని ప్రత్యేక రాష్ట్రంగా మాత్రం చెయ్యరాదని మద్రాసు ప్రభుత్వంవారు ఇదివరలో నివేదించియున్నారు. ప్రస్తుతం ఆమాట వదలిపెట్టినట్లు తెలుస్తోంది. అనగా నాయకత్రయ నివేదికను సంపూర్ణంగా అంగీకరించారు. అనగా అందులో సభ్యులు రాష్ట్రపతి అయిన డా॥ పట్టాభిగారు చేసిన నిర్వచన ప్రకారముగా అని అర్థంచేసుకోవాలి. అనగా చెన్నపట్నం తమిళనాడుయొక్క అంతర్భాగం కాదని దానియొక్క భావం. ఇది నిస్సందేహం.

కావున వాదించి అనవసరమైన వాదోపవాదములు, విపరీతార్థములు పెంచుట బాధ్యత గలవారికి న్యాయముగాదని నా మనవి.


మదరాసు రేసులు
1949-50
నవంబర్ మీటింగు
ఆదివారము 20-11-1949
ఆదివారము 27-11-1949
"ది రేస్ క్లబ్ కప్"



ILLUSTRATED CATALOGUE
FREE
Caroline
AGENCIES (INDIA)
Dealers in
SWISS WATCHES
P.B. NO. 6764
BOMBAY, 22.



ఘనసారచందనీ
ఎరుపు, తెలుపు, పసిమి, చురుకుగల శ్రీల కుసుమవ్యాధులను ఖండించును. సీసా రు 2-4/ అనుపానమునకు చందిని అత్తరు సీసా రు. 1/- పోస్టేజి ప్రత్యేకం. పి. శి. ఏ. అండ్ కంపెనీ, ఆయుర్వేదసమాజం, పెరిదేపి, నెల్లూరుజిల్లా. బ్రాంచి : 7, పీసు మొదలిపేర, మద్రాసు.



మనోహరమైన వి. తులసికూడ
లక్సు టాయిలెట్ సబ్బులోని
క్రొత్త పరిమళమంటె
ఆనందపడుతుంది
ఈవిడ చెప్పుచున్నది
"లక్సు టాయిలెట్
సబ్బులోని
ఈ క్రొత్త పరిమళము
శ్రేష్ఠమైనది"
LUX
LUX TOILET SOAP
సినీమా తారలకు సౌందర్యమిచ్చు సబ్బు
LTS. 216-393 TL



Exide
BATTERIES
ఎక్సైడ్
బ్యాటరీలు
వాడితే
వెంటనే స్టార్ట్ అయితీరును.
కార్లకు, ట్రక్కులకు, బస్సులకు
దక్షిణ ఇండియాలో మెయిన్ సర్వీసు ఏజంట్లు, డిస్ట్రిబ్యూటర్లు:
ది జనరల్ యెలెక్ట్రిక్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్.
మదరాసు, బెంగుళూరు, కోయంబత్తూరు, సికింద్రాబాద్.
Ex 785c

# సమితిలో జాతీయ చైనా ప్రాతినిధ్యం రద్దుకావాలని

## కమ్యూనిస్టు ప్రభుత్వ అభ్యర్థన

### కొమింటాంగ్ ప్రతినిధులకు హక్కులేదని విదేశాంగమంత్రి వాదన

లండన్, నవంబరు 15: ఐక్యరాజ్యసమితిలో చైనా కొమింటాంగ్ ప్రతినిధులకుగల ప్రాతినిధ్యాన్ని తక్షణం రద్దు చేయాలని కమ్యూనిస్టు ప్రభుత్వం నేడు సమితిని కోరినదని న్యూచైనా వార్తా సంస్థ సమాచారాన్ని పీకింగ్ రేడియో ప్రకటించినది. కొమింటాంగ్ ప్రతినిధులు చైనా ప్రతినిధులమని చెప్పుకొనటానికి ఎంత మాత్రమూ అర్హులు కారని కమ్యూనిస్టు విదేశాంగమంత్రి చౌఎన్‌లే సమితి కార్యదర్శి ట్రిగ్వీలీకి ఒక తంతివార్తను పంపినట్లు ఆవార్త వెల్లడిస్తున్నది.

ఈ విషయమై అధికారరీత్యా కమ్యూనిస్టు ప్రభుత్వం దగ్గర నుంచి సందేశం అందలేదని సమితి అధ్యక్షు కార్యదర్శుల కార్యాలయం నేటి రాత్రి ప్రకటించింది.

"చైనా పీపుల్స్ రిపబ్లిక్ చైనా దేశానికి, ప్రజలకూ విముక్తి కలగ చేసింది. అభివృద్ధి నిరోధకమైన కొమింటాంగ్ ప్రభుత్వం ప్రస్తుతం చెదిరిపోయి ప్రవాసంలో ఉన్నందు వల్ల చైనా ప్రజలకు ప్రాతినిధ్యం వహించటానికి, న్యాయ సంబంధమైన హక్కులనూ, వాస్తవిక పదవి వల్లే వచ్చే హక్కులనూ కూడా కోల్పోయినది. అందువల్ల సమితిలో చైనా ప్రజలకు ప్రాతినిధ్యం వహించే హక్కు కొమింటాంగ్ ప్రతినిధులకు లేదని సమితి తక్షణం నిర్ణయించాలని కోరుతున్నాను." అని కమ్యూనిస్టు విదేశాంగ మంత్రి చౌ ఎన్‌లే ట్రిగ్వీలీకి పంపిన తంతి వార్తలో కోరినట్లు న్యూ చైనా వార్తా సంస్థ తెలియజేస్తున్నది.

హాంకాంగ్ సమీపంలో ఉన్న మిర్స్, డీప్ సింధుశాఖలను కొమింటాంగ్ యుద్ధనౌకలు ఉపయోగించరాదని బ్రిటిష్ ప్రభుత్వం పెట్టిన షరతును కొమింటాంగ్ ప్రభుత్వం నేడు తోసివేసినది. చైనారాయబారి కార్యాలయోద్యోగి చెంగ్ నేడు కొమింటాంగ్ ప్రభుత్వ నిర్ణయాన్ని బ్రిటిష్ విదేశాంగ కార్యాలయానికి అందజేశాడు. 1859 వ సం॥ పు ఆంగ్లో-చైనీస్ ఒడంబడికను పట్టి తమ నౌకలకు ఆ సింధుశాఖలు వాడుకునే హక్కు ఉన్నదని కొమింటాంగ్ వాదిస్తున్నది. సదుద్దేశంతో వచ్చే నౌకలకు మాత్రమే ఆ హక్కు ఉంటుందనీ, కొమింటాంగ్ నౌకలు యుద్ధసన్నాహాలు చేసే అవకాశం ఉన్నందువల్ల వాటి వాడుకను నిషేధించామని బ్రిటన్ అంటున్నది.

#### అమెరికన్ నౌకపై దాడి

యాంగ్సీనదిలోనుంచి వెలికి వస్తున్న అమెరికన్ నౌకమీద కొమింటాంగ్ నౌకలు ఫిరంగులు పేల్చినవని: ఆనౌక యజమానులు నేడు అమెరికా విదేశాంగమంత్రి ఎచిసన్‌కి తెలియజేశారు.

## అణుశక్తి కంట్రోల్‌పై రష్యా ప్రతిపాదన ఓటమి

### సమితి రాజకీయ సంఘ నిర్ణయం

లేక్ సక్సెస్, నవంబరు 15: అణుశక్తిని అంతర్జాతీయంగా కంట్రోలు చెయ్యడానికి అణుశక్తి కమిషన్‌లోవున్న అగ్రరాజ్యాలు ఆరున్నూ ఎన్నిసావకాశాలున్నాయో అన్ని సావకాశాలూ విచారించి చూడాలని నేడు సమితి తాలూకు రెండవ రాజకీయసంఘం ఆదేశించింది.

ఈ సూచనను చేస్తూ ఫ్రాంసు కెనడాలు కలసి ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టాయి. ఆ తీర్మానాన్ని పై సంఘం ఆమోదించింది.

ఫ్రాంసు కెనడాల ప్రతిపాదనకు అనుకూలంగా 48 ఓట్లు వచ్చాయి. 5 గురు మాత్రం వ్యతిరేకంగా ఓటువేశారు. మరో 5 గురు తటస్థంగా వున్నారు.

ఈ తీర్మానంలో ఇంకో విశేషం గూడా వుంది. అణుశక్తి కంట్రోలుకు సంబంధించినంతవరకు అన్నిదేశాలు కొంత వరకు తమతమ జాతీయ స్వాతంత్ర్యాన్ని వదులుకోవాలని ఈ తీర్మానం కోరుతున్నది. ...

ఇతర దేశాల ప్రతినిధులు మాట్లాడుతూ రష్యా ప్రతిపాదనను వివిధంగా విమర్శించారు.

న్యూజీలాండు ప్రతినిధి మాట్లాడుతూ, రష్యా ప్రచారంకోసం ఇటువంటి 'మాయ' ...

## విద్యుచ్ఛక్తి సంస్థల స్వాధీనము

### పరిహారం విషయమై అసెంబ్లీలో ప్రశ్నలు

మదరాసు, నవంబరు 15: నేడు అసెంబ్లీలో శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారి ప్రశ్నకు పబ్లిక్ వర్క్సుమంత్రి శ్రీ యం. భక్తవత్సలం రాష్ట్రములో 48 పైవేటు విద్యుచ్ఛక్తి సంస్థలున్నవనియు వానిని 32 కంపెనీలు నిర్వహించుచున్నవనియు, సప్లయి యూనిట్‌రేటు వివిధసంస్థలు, వివిధ స్వభావములనుబట్టి వసూలు చేయుచున్నవనియు, వానిని జాతీయముచేయు ప్రభుత్వము ఉద్దేశించుచున్నదనీ జవాబు ఇచ్చిరి.

లైసెన్సుదార్లకు నష్టపరచుకొను నేటికి పూర్వపు అయిదు సంవత్సరముల సగటు లాభమునకు 20 రెట్ల మొత్తముగాని 1946 ఏప్రియల్ 1వ తేదీ నాడు సంవత్సరములలో షేర్లవిలువనుబట్టి సంస్థషేర్ల మొత్తము విలువగాని ప్రభుత్వము వప్పగించు ఆస్తులవిలువకు కొంత మొత్తము చేర్చిగాని పరిహారముగా ఇచ్చెదరనియు, లైసెన్సుదార్లు ఈ మూడు విధములలో ఏదో ఒకదానిని అంగీకరించవచ్చునీకూడ మంత్రిగారు తెలిపిరి.

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు: చెడిపోయిన పనులను ముందుగా తీసుకొనెదరా? నష్టాలవు పేటను తీసుకొనెదరా?

వ: బిల్లుమరతులకు వాటాదార్లు ఒప్పుకుంటేల్లాగే చూసెదమని, తాము ఇదివరకే గౌరవసభ్యునికి చెప్పానని.

శ్రీ లింగరాజు: ఒప్పుకుంటే వెంటనే తీసుకుంటారా?

వ: క్రమానుకూలముగా తీసుకొనెదరు.

### విద్యుత్ ప్రణాళికలకు ప్రభుత్వ పెట్టుబడి

1949 మార్చి 31 వరకు విద్యుత్ ప్రణాళికలపైన ప్రభుత్వ పెట్టుబడి రు 1370.11 లక్షలనియు, ...

### ప్రభుత్వ ట్రెజరీబిల్లులు

1948-49 లో మదరాసు ప్రభుత్వ ట్రెజరీబిల్లుల సగటు డిస్కౌంటు ...

### హరిజన క్రైస్తవులు

...

### బడ్జటు సమావేశము

మదరాసు, నవంబరు 15: 1950/51 ...

,, మార్చి 21 :-(1) ఆయవ్యయపట్టి మీద చర్చ. (2) 1950/51 బడ్జటు ఓటింగు.

,, మార్చి 25 :-1950/51 బడ్జటు ఓటింగ్.

,, మార్చి 27 :-1950/51 ఆదనపు గ్రాంటు ...

,, మార్చి 28 :-1950/51 బడ్జటు ఓటింగ్ (ఆఖరిరోజు)

## రాష్ట్రప్రధాని సేవాప్రశంస

### ద. భారత సహకారబీమా సంస్థలో చిత్రపటావిష్కరణ

గోపాలరెడ్డిగారి ప్రసంగం

చెన్నపురి, నవంబరు 16: దక్షిణ ఇండియా సహకార భీమాకంపెనీ భవనములో నిన్నసాయంత్రం ఆర్థికమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు మదరాసు ప్రధాని శ్రీ పి. యస్. కుమారస్వామిరాజాగారి చిత్రపటమును ఆవిష్కరిస్తూ వారు రాష్ట్ర వ్యవహారములను కడు సమర్థతతో నడుపుచున్నందుకు ప్రశంసించిరి.

శ్రీ కే. భాష్యంగారు కీ॥ శే॥ వి. వియ్యన్న పటమును బహిరంగ పరుస్తూ ఆయన రాష్ట్ర సహకారోద్యమమునకు చేసిన అమోఘసేవను కొనియాడిరి.

సంఘాధ్యక్షులు శ్రీ వి. పార్థసారథిగారు సభాసదులకు స్వాగతమొసగుచూ శ్రీ కుమారస్వామి రాజాగారు 1941 నుండి 46 వరకు సంఘాధ్యక్షులుగానుండి సంఘమును ముందుకు తేవటానికి చాలాకృషి చేసినారనిరి. శ్రీ వియ్యన్నగారు 1946 లో అధ్యక్షులై గత ఏప్రిల్‌లో చనిపోవునంతవరకు అధ్యక్షులుగానుండి భీమా విషయములలోను సహకార ఉద్యమములోను విశేష ఆసక్తికలిగి యుండిరనిరి.

శ్రీ బి. గోపాలరెడ్డిగారు మాట్లాడుచూ శ్రీ కుమారస్వామి రాజాగారు తెలుగు వారైననూ తమిళదేశములో అనేక యేండ్లపూర్వంనుండి స్థావరం ఏర్పరచుకొని తమ స్వశక్తి సామర్థ్యములవల్ల పైకి వచ్చినారనిరి. ...

### రాజకీయ బాధితులకు ఆర్థిక సహాయం

మదరాసు, నవంబరు 15: 1942 కాంగ్రెసు ఉద్యమములో ...

## ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి మద్రాసు ప్రభుత్వ సుముఖత

### చెన్నపట్నాన్నిగూర్చి నాయకత్రయ నివేదికకు అంగీకారం

చెన్నపట్నం, నవంబరు 16: చెన్నపట్నం, తమిళనాడులోనే చేరాలని అధిక సంఖ్యాకులతో మద్రాసు కార్పొరేషను వారు తీర్మానం గావించినారనియు, ఆ తీర్మానమును కార్పొరేషనువారు ప్రభుత్వమునకు పంపినారనియు, మద్రాసు ప్రభుత్వం నాయకత్రయ నివేదికను అంగీకరించుచును, ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సమ్మతించుచునూ తీర్మానించినారనియు సభానాయకులు గోపాలరెడ్డిగారు సలాంగారి ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

మజీద్ గారు :- మద్రాసు పురపాలక సంఘ అభిప్రాయమే చెన్నపట్నం భవిష్యత్తు సందర్భమున ఆఖరు మాటగదా? ...

### ఎస్.ఎస్.ఎల్.సి.పుస్తకాలు

...

### పానువెల తగ్గుదల

### బ్రిటిష్ మంత్రుల ఆందోళన

...


సదరన్ రోడ్‌వేస్ లిమిటెడ్,
మదరాసు.
టెలిఫోన్ నంబరు
ఆఫీసు వేళలలో అనగా సోమవారం నుండి శుక్రవారం వరకు ఉ॥ 8-30 గం. లు మొదలు 12-30 గం. ల వరకు, మ॥ 1-30 గం. లు మొదలు సా॥ 5-30 గం. ల వరకు, శనివారములు ఉ॥ 8-30 గం. ల మొదలు 1 గం. వరకు. 86486
ఆఫీసు వేళలు దాటినతరువాతను ఆదివారములు, శెలవు రోజులలోను 86488.

MYERS PUMPS
అమోఘమైన నీటి సప్లయికి
ప్రతి పనికి మైయర్సు పంపు కలదు. మీకు కావలసినప్పుడెల్లను, చాలినంత వత్తిడి క్రింద, నీటి ప్రవాహము సప్లయి అగుటకు, మైయర్సు పంపు మీద ఆధారపడి యుండవచ్చును.
లోతు లేని బావి స్వయముగా ఆయిలింగు చేసుకొను ఎలెక్ట్రిక్ పంపు
అమ్మకముల తరువాత మేము సర్వీసు చేయుదుము
వాటర్ సప్లయి స్పెషలిస్ట్సు లిమిటెడ్,
23-24, సెకండ్‌లైన్‌బీచి, మద్రాసు. టెలిగ్రాం "Pumpmen" ఫోన్: 4836.

KIRON
THE BETTER LAMP

నోటీసు
మద్రాసు స్మాల్‌కాజ్ కోర్టు
దావా నెం. 4843 ఆఫ్ 1949
వాది: పి. ఎం. నటరాజన్
ప్రతివాది: ఎస్. రహిమతుల్లా సాహెబు, మర్చంటు, మద్రాసురోడ్డు, కడప.
పై దావా రు 225-2-0 ఖర్చులతో రాబట్టుకొనుటకు తేబడి, 23-11-49 తేది 3 వ జడ్జిగారి యెదుట తుది పరిష్కారమునకు వాయిదా వేయబడినదని ప్రతివాదికి తెలపడమైనది. ఆరోజు ప్రతివాది హాజరు కానిచో ఆతని పరోక్షమున దావా డిక్రీ చేయబడును.
సి. వి. నీలకంఠన్,
వాదితరపు అడ్వకేటు, మద్రాసు, 14-11-49.

ఉబ్బసం మందు
చిత్రకోటహంస రాజ్ కొండమూలిక
5-12-49 పౌర్ణమినాడు దీనిని వాడితే ఒక మోతాదుతో ఉబ్బసం నయమవుతుంది. జాబుల ఇంగ్లీషులోగాని హిందీలోగాని వ్రాయండి.
MAHATMA TIYAGI BABA
Ansuiya Ashram, Chitrakot, Banda, U. P.

ఉజ్జలా లాంతర్లు
ఇతర లాంతర్లను మరుగుపరచును
దృఢంగాను అందంగాను వుండి, ఉజ్జలా లాంతర్లు ఏండ్లతరబడి స్థిరంగా ప్రకాశవంతమైన వెలుగు నిచ్చునట్లు తయారుచేయబడినవి. అవి స్వదేశ విదేశపు లాంతర్లలో దేనికీ తీసిపోవు.
ఉజ్జలా లాంటరన్ వర్క్సు
మేనేజింగు ఏజంట్లు:
ఏ. కే. సర్కార్ (ఇండస్ట్రీస్) లి.,
10, హేస్టింగ్సువీధి, కలకత్తా.
ఏజంట్లు:
మెసర్సు ఎ. కే. ఏ. అండ్ కంపెనీ,
23, వినియప్పనాయకన్ వీధి,
మదరాసు-1.

రైఫిల్ గుండా? సిమ్మ తోపులా?
మీకు నచ్చినవాటిని ఎరుకోనండి. మరి ఇతర రకములను కూడా చూడండి. మా సరకు అతి శుభ్రమైనదని, శ్రేష్ఠమైనదని మీ రుచియే చెప్పగలదు.
దేశమంతా ఆదరించబడినవి
సావరిన్ స్వీటుస
సి. కే. సి. పి. కన్‌ఫెక్షనరీ (మద్రాసు) లిమిటెడ్, మదరాసు. 24.

## గంటల పంచాంగం

విరోధి సం॥ కార్తీక బ॥ ద్వాదశి
1949 సం॥ నవం॥ 17 గురువారం
సు॥ ద్వాదశి రా 11-14ల సా 7-4 శేవర్జ్యం ఉ 6-22ను రా వ రా 2-13 ల 3-38 ను.
బ॥ త్రయో॥ నవం॥ 18 శుక్రవారం
సు॥ త్రయోదశి సా 7-57 చిత్త సా 4-33 వర్జ్యం రా 9-31 ల 10-56 ను.



# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ కార్తీక బ॥ ద్వాదశి గురువారం

## అప్పు సదుపాయాలు

ఆర్థిక మాంద్యమనునది సాక్షాత్తు ఏర్పడక పోయినప్పటికి దేశములో ధనమాంద్యము ఏర్పడినట్లు వ్యాపారస్థులదేగాక అన్ని వర్గముల నిత్యానుభవము విశదము చేయుచున్నది. బ్యాంకుల వద్దనుండి వ్యాపారమునకుకూడ అప్పు దొరకుట దుర్లభ మగుచున్నది. బ్యాంకులు తామిచ్చు అప్పులను ఎప్పుడైతే బిగబట్టుచున్నవో పెట్టుబడికి వ్యక్తులవద్దకు అప్పుకని పోవుటయు, వారు విపరీతముగ వడ్డీ రేటును పుచ్చుకొనుటయు జరుగుచున్నది. నిర్దుష్టమైన వ్యాపారము చేయువారికికూడ ఈదుస్థితి తప్పుటలేదు. అలా దొరకు అప్పుకూడ పరిమితవర్గములకు పరిమిత మొత్తము మాత్రమే దొరకుచున్నది. వస్తువుల ధరలు మాత్రము ఎక్కువ ప్రమాణములోనే యున్నవి. ఈస్థితికి రిజర్వుబ్యాంకు అప్పుల నిచ్చు విషయమున దేశములోని బ్యాంకుల కిచ్చిన సలహాలు కారణమని అందరిభావము. మంగళవారము దక్షిణ భారత వాణిజ్యసంఘ అధ్యక్షుడు, తమ సంఘము రిజర్వు బ్యాంకు గవర్నరు సర్ బి. రామారావుగారి కిచ్చిన విందుసందర్భమున ఈఅంశమును తెలియజేసెను. రిజర్వుబ్యాంకువడ్డీ రేటును3%చొ॥న పరిమితము చేయుటవలన, ఆరేటుకు పైకము లభ్యమగుట లేదని తెలిపిరి. దానికి కారణము అప్పులనిచ్చుట పరిమితముచేయవలసినదనిరిజర్వుబ్యాంకు వారు బ్యాంకులకు సలహానిచ్చుట మూలమని సూచించిరి. అప్పుల నిచ్చుటలో బ్యాంకులు జాగ్రత్తగ వ్యవహరించు ఆవశ్యకతను గూర్చి ఎవరును కాదనజాలరు. కాని దేశములోని అవసరములను గమనించి, అప్పు లిచ్చు విషయమున కొంత ఉదారవిధాన మవలంబించు ఆవశ్యకతను రిజర్వుబ్యాంకు గమనింపవలసియున్నది. బ్యాంకులకు డిపాజిట్లు రాక, ఉన్నవాటిని వారు అప్పులిచ్చి వడ్డీరూపముగలాభములను సంపాదించకపోయిన పక్షములో, కొద్ది పరిమితిలో ఇచ్చిన అప్పులపైననే వడ్డీని అధికముచేయవలసి యుండును. ఇపుడు వాస్తవముగ అదే జరుగుచున్నది. అలా వడ్డీ అధికముచేసినగాని, డిపాజిట్ల మొత్తమునకు వడ్డీ నిచ్చుటగాని, వాటాదారులకు డివిడెండ్లను పంచిపెట్టుటగాని సాధ్యముకాదు.

నక్రమమైన వ్యాపారావసరములకు అప్పుల నివ్వకూడదని రిజర్వుబ్యాంకు, బ్యాంకులకు సలహా నివ్వలేదని సర్. బి. రామారావుగారు చెప్పిరి. కాని వ్యాపారస్థుల అనుభవము మాత్రము భిన్నముగ నున్నది. అంతేకాకధనమాంద్య మున్నట్లుగ తమకు కనుపడలేదని, బొంబాయి, కలకత్తాలందు పరిస్థితులు అంత కటువుగ లేవనియు, మద్రాసునందు ఇంత బిగువుగ ఉండుటకు తమకు కారణముగుపడలేదని శ్రీ రామారావుగారు తెలిపిరి. మద్రాసువారికి ఇది ఆశ్చర్యముగ కనుపడకమానదు. స్టాకుఎక్స్ఛేంజి అధ్యక్షుడు ఆశించినట్లు త్వరలో అదేవిధమైన స్థితి మద్రాసునందు కూడ ఏర్పడుటకు అందరు ఆతురతతో ఎదురు చూచెదరు. అందుకు రిజర్వు బ్యాంకువారుకూడ సాయపడి దోహద మిచ్చెదరని ఆశించవచ్చును. బొంబాయి, కలకత్తాలందు పరిస్థితి మారుటకు పాకిస్తానుతో వ్యాపారము చేయుటకుగల ఆటంకములని సూచింపబడినది. ఇక్కడ అట్టి పరిస్థితులులేవు కదా? ఆప్రాంతములందలిపైకముఇక్కడికిప్రసరించినమేలుగనుండును.

శ్రీ రామారావుగారు చెప్పినట్లు దేశ పారిశ్రామిక స్థిరత్వము దేశ బ్యాంకుల సౌష్ఠవముమీద ఆధారపడి యుండును. బ్యాంకులు పెట్టుబడి ఇచ్చినగాని, పరిశ్రమలు అభివృద్ధి చెందజాలవు. పరిశ్రమలకు సహాయముచేయుటకు, ప్రభుత్వము కొన్ని సంస్థలను స్థాపించినది. అయినప్పటికీ, కేవలము వాటిమీదనే ఆధార పడుటకు వీలుండదు. సామాన్య బ్యాంకులు కూడ పెట్టుబడుల నివ్వవలసియుండును. శ్రీ రామారావుగారు చెప్పినట్లు డిపాజిటర్ల పైకము దుర్వినియోగము కాకుండునట్లు రిజర్వుబ్యాంకు చూచుట అవసరమను విషయమును ఎవరును కాదనజాలరు. కాని వర్తకమును వ్యాపారమును స్తంభింపజేయునట్లు నిబంధన లుండరాదు.

పెట్టుబడులు కేవలము వర్తక వ్యాపార వర్గములకేగాక, దేశమునకు ప్రధానమైన వ్యవసాయదారుని అవసరములకుకూడ బ్యాంకులు పెట్టుబడి పెట్టునట్లు చూడవలెను. అందుకు రిజర్వు బ్యాంకు దోహద మొసగవలెను. మొన్న తుపానువల్ల ఆంధ్ర దేశములో అపారనష్టము కలిగినది. కోస్తాజిల్లాలందు దాదాపు అన్ని తరగతులవారు నష్టమునకులోనైరి. గ్రామీయులు అందరికన్న ఎక్కువగ నష్టపడిరి. పంటల నష్టమేగాక పశువుల నష్టము, ఇండ్ల నష్టము కూడ జరిగినది. వీటన్నిటినీ తిరిగి ఏర్పరచుకొనుటకు వారికి అప్పులు కావలసియున్నది. వాటి నివ్వగలిగినది, ఇవ్వవలసినది సహకార బ్యాంకులు. అవికనుక సాధారణ పద్ధతిలో నిబంధనల ననుసరించి, అప్పులనివ్వదలచిన ఎవరికినీ అప్పు ఇచ్చుటకు వీలు కాకపోవచ్చును. అందువల్ల వారు సామాన్య పద్ధతిని విరమించి కొంతసాహసముతో అప్పుల నివ్వవలసి యుండును. లేని యెడల సహకార బ్యాంకుల యొక్క ప్రయోజనము ఎవరికినీ లభించదు.

### శ్రీ కళా వెంకట్రావుగారి ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 15: కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు ఈ క్రింది ప్రకటన గావించుచున్నారు:-

"కాంగ్రెస్ ప్రాథమిక సభ్యులను చేర్చు గడువును నేను నవంబరు ఆఖరు వరకు పొడిగించితినని విజయవాడ భారత ప్రెస్‌ట్రస్టు విలేఖరి పంపిన ఒక వార్త పత్రికలో ప్రచురింపబడినది. ఈ వార్త సరియైనదికాదు. ఈ గడువు దేశమంతట పొడిగింపబడలేదు. ఆంధ్రదేశములో ప్రచండమైన తుపాను వచ్చుటచేత ఆ ప్రాంతములో కాంగ్రెస్ సభ్యులను నవంబరు 30 తేదీవరకు చేర్చుటకు నేను అనుమతి నొసంగితిని. ఇట్టి అనుమతిని నేను వేరే మంరెటికి ఒసంగితినని ప్రెస్‌ట్రస్టు విలేఖరి తెలిపెను. కాంగ్రెస్ సభ్యులను చేర్చు పనిని రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘములన్నియు నవంబరు 15న పూర్తిచేయవలెనని కోరుచున్నాను. సభ్యుల పట్టికలు మున్నగువాని ప్రచురణ విషయమై త్వరలో ఈ కార్యాలయమునుండి ప్రకటన వెలువడును.

## తుపాన్ బాధితులకు సహాయం
### రాష్ట్రపతి ఉద్బోధ

న్యూఢిల్లీ, నవంబరు 15: ఆంధ్రదేశమునందలి 5 జిల్లాలలో ఐదు రోజులు వీచిన ప్రపంచ ఝంఝామారుతమువల్ల నష్టపడిన వారి సహాయార్థము ఉదారముగా ద్రవ్యమొసంగవలెనను విజ్ఞప్తిని కాంగ్రెస్ మహాసభాధ్యక్షులగు డా॥ పట్టాభి సీతారామయ్యగారు నేడు భారతదేశ ప్రజలందరికిని గావించి యున్నారు.

ఈ తుపానువల్ల కలిగిన నష్టము అపారమని, ఈనష్టము స్థానికప్రజల ద్రవ్యసహాయమువల్ల భర్తీయగునది కాదని, భారతదేశ ప్రజలందరు సహాయము చేయవలెనని రాష్ట్రపతి చెప్పుచున్నారు. 'ఈ 5 జిల్లాలలో ఏదోఒక రూపమున నష్టపడనివాడు లేడు. దాదాపు అన్ని యిళ్లూ దెబ్బతిన్నవి. ఈ యిళ్ళను బాగుచేయుటకు సామగ్రి కావలసియున్నది. నష్టము 50 కోట్ల రూపాయలుగా నుండునని అంచనావేయుచున్నారు. ఇంతనష్టమును భారతదేశ మంతయూగూడ భర్తీ చేయగలుగునను టదు రూహ్యము. ఐనప్పటికి నష్టపడినవారి సద్యోసహాయమునకు వారి అన్నమునకు బట్టకు యేర్పాట్లు చేయవలెనను ట స్పష్టము. ఇంకా క్రమేపి జరుగవలసిన పనులకు 2 కోట్ల రూపాయలు కావలసియున్నది. అనగా రయితులు ఎద్దులు, దున్నలు మున్నగు పశువులను కొనుటకు, వ్యవసాయ పనిముట్లు, గృహనిర్మాణ సామగ్రి కొనుటకు, మెట్టవేసిన పొలములనుండి మట్టితీసివేయుటకు, చెరువుగట్లను మరమ్మతు చేయుటకు, పడిపోయిన చెట్లను, ముఖ్యముగా కొబ్బరి మామిడి, నారింజ మున్నగు చెట్లు తిరిగి పెంచుటకు 2 కోట్ల రూపాయలు అవసరము. ప్రజలందరు, మన ధర్మాత్ములు, దేశభక్తులు, వీరు వారననేల ప్రతిగృహస్థు ఈ జిల్లాలలో నష్టపడినవారి కష్టము బాపుటకు తాము చేయగలిగినదంతయు చేయవలెనని కోరుచున్నాను. నగరముల షేరీఫులు, కార్పొరేషన్ల మేయర్లు మునిసిపాలిటీ చెయిర్మన్లు సభలు చేసి సహాయకార్యముల విషయమై ప్రజలకు శ్రద్ధాసక్తులు కలిగించవలెను. పంచాయతీ బోర్డుల, స్థానిక బోర్డుల అధ్యక్షులు ఈ సందర్భమున చేయగలిగిన దెంతేని కలదు. వారు తాముస్వయముగా ద్రవ్య మునిచ్చుటమాత్రమే గాక తమ ప్రాంతములలో ద్రవ్యము వసూలు చేయవలెను. ఈ సహాయకార్యములలో భీమా కంపెనీలు- పారిశ్రామిక, వాణిజ్యసంస్థలు ప్రథమ స్థానము నాక్రమించవలెను. గుజరాత్‌లో వరదలు వచ్చినప్పుడు, బీహారులో వరదలు వచ్చినప్పుడు వారు యిట్టి సహాయము చేసియుండిరి. అప్పుడు వారు చూపిన ఔదార్యమును యిప్పుడుగూడ చూపగలరు. ప్రతికలవారు పనూళ్ళు ప్రారంభించి ప్రకృతి విలయతాండవమువల్ల అవారముగా నష్టపడినవారికి సహాయముచేయవలెను అని రాష్ట్రపతి డా॥ పట్టాభిగారు తమ విజ్ఞప్తిలో చెప్పుచున్నారు.

### మదరాసులో 4 అం. వర్షం

మదరాసు, నవంబరు 16: నేడుదయం 8.30 గ. పూర్వం 0.79 అం. తరువాత 11-30 గ. వరకు 2.56 అం, 1.30 గ. వరకు $1\frac{1}{2}$ అం. మదరాసులో వాన కురిసెను.

48 గంటలలోగా తమిళనాడునందు దానికి చేరియున్న దక్షిణ ఆంధ్రప్రాంతాలందు ఎక్కువ వర్షించునని వాతావరణ శాఖవారు సూచించుచున్నారు.

ఈశాన్యఋతుపు తీవ్రంగా నేడుదయం కోరమాండలు తీరమంతట వర్షములో ప్రారంభమయింది.

### ద. ఆఫ్రికాలో రైలు ప్రమాదం
#### 71 మంది మరణం: 117 మందికి గాయాలు

వాటర్వాల్ బోవెన్, (ట్రాన్స్‌వాల్) నవంబర్ 15: ఈ వేళ ఉదయం ఈ పట్టణానికి సమీపంలో ఒక నదిని దాటుతున్న రైలు వంతెన మీద నుంచి కింద నదులు కక్కుతూ ప్రవహిస్తున్న నదిలో పడిపోయినందువల్ల 71 మంది మరణించారు. 117మందిగాయపడ్డారు. వంతెన నదిమట్టానికి 50 అడుగుల ఎత్తున ఉన్నది. చనిపోయిన వారిలో ఇంజన్ డ్రైవరు (యూరపియన్) కూడా ఉన్నాడు.

గాయపడ్డ వారిలో 114 మంది ఆఫ్రికను. చనిపోయిన వారిలో అధికసంఖ్యాకులు వాళ్లే. రైలులో అసలు 500 మంది ప్రయాణం చేస్తున్నారు. గాయపడ్డ వారిని రక్షించటం, చనిపోయిన వారి శవాలను కనుక్కోటం జరుగుతున్నది.

## పశ్చిమ యూరప్ రాజ్య కూటమిలో పశ్చిమ జర్మనీ సమీకరణ
### పార్లమెంటులో ఛాన్సలర్ అడీనోర్ వివరణ

బాన్, నవంబరు 15: పశ్చిమ జర్మనీ భవిష్యత్తును గూర్చి పారిస్‌లో సమావేశమైన అగ్ర రాజ్యత్రయ విదేశాంగ మంత్రులు చేసిన నిర్ణయాన్ని నేడు పార్లమెంటులో చాన్సలర్ కాన్‌రాడ్ అండినోర్ ప్రకటించారు.

పశ్చిమ యూరప్ సమాఖ్యలో ఈ జర్మన్ ప్రభుత్వానికి ప్రాతినిధ్యం ఇవ్వాలని పారిస్‌లో వారు నిర్ణయించారు.

ఈ విషయంలో ఇతర వివరాలను గూర్చి, ఇంకా ఇతర సమస్యలను గూర్చి వారికి చర్చించే నావకాశంలేదు కాబట్టి వాటిని తమ హైకమిషనర్లకు వారు వదిలివేశారు. ఈసమాలోచనలు గనుక ఫలవంత మయ్యేటట్లయితే, మంచి జర్మనీ చాలా ముందుకుపోయే నావకాశం లభిస్తుంది. అని ఛాన్సలర్ అడినోర్ అన్నారు.

ఇప్పుడు పశ్చిమ రాజ్యాలవారితో యంత్రోద్వాసనను గూర్చిన సంభాషణలు జరుగుతున్నాయని, అందాకా ఆ కార్యక్రమం కొంత నెమ్మదిగా కొనసాగుతుందని గూడా కాన్‌రాడ్ అడినోర్ పార్లమెంటుకు నివేదించారు.

ఈక్క, దానికి సంబంధించిన ఇతర పరిశ్రమల విషయంలో అన్నివిషయాలను గూర్చి బాగా సమాలోచించవలసిందని అగ్రరాజ్య త్రయంవారు తమ కమిషనర్లకు ఆదేశాలు పంపారు.

పశ్చిమజర్మనీ ప్రభుత్వంతో ఇంకా ఈ క్రింద పేర్కొన్న అంశాలనుగూర్చి ఆ హైకమిషనర్లు చర్చించి ఒప్పందాలు చేసుకుంటారు:—

(1) అంతర్జాతీయ వ్యవస్థల్లో పశ్చిమ జర్మనీ చేరే అవకాశం కల్పించడం.

(2) పశ్చిమ రాజ్యాలవారికి, జర్మనీకి మధ్యవున్న అనుమానాలను తొలగించేందుకు తగిన మార్గాలనుగూర్చి ఆలోచన.

(3) ఇతరదేశాలతో కాన్సలర్ సంబంధాలు, వర్తక సంబంధాలు జర్మనీ ఏర్పాటు చేసుకోగల స్వాతంత్ర్యం.

ఈ విషయాలను పార్లమెంటుకు నివేదించిన తరువాత అడినోర్ జర్మనీ ప్రజలకు, ఫ్రాంసు ప్రజలకు మధ్య వుండే సన్నిహిత సంబంధాలమీదనే ఐరోపా భవిష్యత్తు ఆధారపడి వున్నదని, అందువల్ల ఈ రెండు దేశాలు తమ మధ్య సౌహార్దమైన సంబంధాలను ఏర్పరచుకో గలవని తాను నమ్ముతున్నానని అన్నారు.

## విశ్వవిద్యాలయ సెనేట్
### స్థానిక సంస్థల తరపున కాంగ్రెస్ అభ్యర్థుల నియామకం

విజయవాడ, నవంబర్ 16: ఆంధ్ర, మద్రాసు విశ్వవిద్యాలయముల సెనేట్లకు స్థానిక సంస్థల సభ్యత్వపు ఎన్నికల సందర్భంలో, జిల్లా వారీగా ఈ క్రింది కాంగ్రెసు అభ్యర్థులు నియమితులైనారని ఆం. రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి కె. ఓబులరెడ్డిగారు ప్రకటనచేస్తున్నారు.

#### ఆంధ్ర విశ్వవిద్యాలయం

తూర్పు గోదావరి—చల్లా వెంకటావుగారు, కృష్ణా — ఐ. ఇమాన్యుయెల్, నెల్లూరు—దేవి రెడ్డి లక్ష్మిరెడ్డి, చిత్తూరు—జి. శ్రీ రామరెడ్డి, డి. మునిరత్నం నాయుడు, అనంతపురం—ఐ. వి. శ్రీనివాసరెడ్డి, కడప—సి. హెచ్. బాలిరెడ్డి, సోమిశెట్టి కృష్ణమూర్తి;

#### మద్రాసు విశ్వవిద్యాలయం

కర్నూలు—నూరి రామిరెడ్డి, చిత్తూరు—ఎన్. ఎస్. విలియమ్స్,

పై జిల్లాలలో కాంగ్రెసు తరపున అభ్యర్థిత్వం కోసం దరఖాస్తు పెట్టుకున్నవారు, పైన పేర్కొనబడిన వారికి అనుకూలంగా ఉపసంహరించుకుని, కాంగ్రెసు అభ్యర్థుల విజయంకోసము కృషి చేయవలసినదిగా కోరుతున్నాననీ, జిల్లా బోర్డు అధ్యక్షులు, కాంగ్రెసు మున్సిపాలిటీల అధ్యక్షులు, జిల్లాకాంగ్రెసు అధ్యక్షులు పై కాంగ్రెసు అభ్యర్థుల పక్షాన ప్రచారం చేయవలసిందిగా కోరుతున్నానని ఓబులరెడ్డిగారు విజ్ఞప్తి చేస్తున్నారు.

## రాష్ట్రముల నమూనా రాజ్యాంగం

బెంగుళూరు, నవంబరు 15: భారత రాష్ట్రముల నమూనా రాజ్యాంగమును మైసూరు ఆమోదించింది.

రాష్ట్రముల పరిపాలనా విషయంలో భారత రాజ్యాంగ పరిషత్తువారు ఆమోదించిన నిబంధనలను భారత రాజ్యాంగములో చేర్చవచ్చునని సంస్థాన రాజ్యాంగ పరిషత్తువారు నేడొకతీర్మానం చేశారు. ఈ విధంగా తయారుచేయబడిన రాజ్యాంగమును సంస్థానం ఆమోదించవచ్చునని పరిషత్తు మైసూరు మహారాజుకు సిఫార్సు చేసింది. ఈ సిఫార్సును ఆమోదిస్తూను, రాష్ట్రముల రాజ్యాంగమును భారత రాజ్యాంగ పరిషత్తు తయారుచేయుటకు అంగీకరిస్తూను మైసూరు మహారాజా యిప్పుడు ఒక ప్రకటన జారీచేయును.

## వ్యాపారానికి ద్రవ్యం లేకపోలేదు
### రిజర్వుబ్యాంక్ అధ్యక్షుని ప్రకటన

మదరాసు, నవంబరు 16: "బొంబాయిలోగాని యితర చోట్లగాని పెట్టుబడికి తగిన ద్రవ్యం లేకపోలేదు. మార్కెట్టులో ద్రవ్యావకాశాలు బిగుసుకోలేదు. ఈ సమయాన క్రితంవత్సరాలకన్న యీ వత్సరం బాగానేయుంది. పాకిస్తానుతో వర్తకం యించుమించు నిలచిపోయి, దిగుమతులు తగ్గుచున్నందున ద్రవ్యావకాశాలుబాగానే యున్నాయి. మదరాసులో మాత్రం ఎందుకు ద్రవ్యావకాశం బిగుసుకుపోయిందో తెలియకుండా యుంది." అని సర్ బనిగల్ రామారావుగారు, రిజర్వుబ్యాంకు గవర్నరు నిన్న సాయంకాలం ద. ఇ. వాణిజ్య సంఘమునందుపన్యసించుచు నుడివిరి. డాలరు విలువ పెరిగినాక బ్యాంకులన్నింటినీ సక్రమమయిన వ్యాపారులకు ఋణాలు యివ్వకుండ నిర్బంధించితిమని చెప్పట సరికాదనిరి.

వ్యాపారస్తులందరు ఇండియా ప్రభుత్వ ఉపప్రధాని పటేలుగారు చెప్పిన మితవ్యయ సూచనలు అనుసరించినచో దేశంలోగల చిక్కులన్ని తొలగిపోగలవనిరి.

ఇండియాలో అన్ని బ్యాంకులను ఏడాదికోసారయినారిజర్వుబ్యాంకుతరపున నిపుణులు తణికీచేసే యేర్పాటులు చేయుచున్నామనిరి. "వ్యాపారస్తులు ప్రభుత్వంతోనేగాక రాష్ట్ర ప్రభుత్వాలుగూడ కేంద్రప్రభుత్వంతో సహకరించి ఆర్థిక చిక్కులను తొలగించుటకు తోడ్పడవలెను. రూపాయివిలువ మారిన వెంటనే బ్యాంకులకు, ధరలుపెంచే ఉద్దేశంతో ద్రవ్యందాచేవారికి జూదపుదృష్టితో వ్యాపారం చేసేవారికి ఋణాలివ్వరాదని బ్యాంకులన్నింటికి నే చేసిన విన్నపం ఆపార్థం చేసుకున్నట్లున్నారు. అట్టి ఋణాలను అరికట్టుట చాల అవసరం. సక్రమమయిన వ్యాపారానికి ఋణాలు యిచ్చే విషయమున ఎటువంటి నిర్బంధాలు చేయలేదు" అని అధ్యక్షులు మురుగప్పచెట్టిగారి స్వాగతోపన్యాసమునకు బదులుగ చెప్పిరి.

సర్ బి. రామారావుగారు రేపు రిజర్వు బ్యాంకు సెంట్రలుబోర్డు సమావేశమునకు అధ్యక్షతవహింతురు. మదరాసులోని రిజర్వుబ్యాంకులకు భవనంగూర్చి ఏర్పాటులు చేయుదురు. వాణిజ్యసంస్థలన్నింటిని చూచెదరు.

## హైద్రాబాదు సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నికలు
### స్వామీజీ, రామకృష్ణరావుగార్లతో సహా మొత్తం 8 మంది నామినేషన్ల దాఖలు

హైద్రాబాద్, నవంబరు 15: నవంబరు 30న జరగనున్న హైద్రాబాద్ సంస్థాన కాంగ్రెస్ అధ్యక్ష ఎన్నికలలో పోటీచెయ్యటానికి యిప్పటివరకు 8 మంది సంస్థానకాంగ్రెస్ కేంద్ర కార్యాలయంలో నామినేషన్లు దాఖలుచేశారని తెలుస్తున్నది.

వీరిలో సంస్థానకాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానందతీర్థ, బూర్గుల రామకృష్ణరావుగార్లు ఉన్నారు. మిగిలిన 6 గురు తమ నామినేషన్లను ఉపసంహరించుకోగా చివరికి వీరిద్దరే పోటీకి నిలబడతారని తెలుస్తున్నది.

నామినేషన్లు దాఖలుచేసిన వారిలో మిగిలినవారు. జనార్దనరావు దేశాయ్, డా॥ జి. ఎస్. మేల్కోట్, గోవిందప్రసాద్, దిగంబరరావు బిందూ, వినాయకరావు విద్యాలంకార్, పండిట్ నరేంద్రజీ. నామినేషన్లు ఉపసంహరించుకోవటానికి నవంబరు 25 చివరి తేదీగా నిర్ణయించబడింది.

### స్వామీజీ, బూర్గుల సంప్రదింపుల వైఫల్యం

హైదరాబాద్, నవంబరు 15:— సంస్థాన కాంగ్రెస్‌లోని విభేదాల పరిష్కారప్రయత్నంలో "పోటీ" పక్షం తరపున బూర్గుల రామకృష్ణారావు గారు నేటిసాయంకాలం సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానంద తీర్థగారిని కలుసుకొన్నారని తెలుస్తున్నది.

హైదరాబాద్ సంస్థాన క్షేమవృష్టాశి కాంగ్రెస్ వాదులు తమ తమ విభేదాలను విస్మరించి, ఒక పరిష్కారానికి రావలసిందనీ, ఆ విషయాన్ని తనకు నవంబరు 15 లోగా తెలియజెయ్యవలసిందనీ యిటీవల హైద్రాబాద్ వచ్చిన కేంద్ర ప్రభుత్వ సంస్థాన శాఖ రాజకీయ సలహాదారు వి. పి. మీనన్‌గారు తెలియజేశారు. నేటిసాయంకాలం సమావేశంలోకూడ పరిష్కారప్రయత్నం సఫలంకాలేదని తెలుస్తున్నది. తిరిగి వీరిద్దరు రేపుగాని, ఎల్లుండిగాని సమావేశం కాగలరని ఒక ప్రముఖ కాంగ్రెస్ వాది అన్నారు. ఉభయపక్షాలు ఒక పరిష్కారానికి రావటానికి ముఖ్యమైన అడ్డంకులలో, నల్లగొండ జిల్లా కాంగ్రెస్ సంఘ ఎన్నికల నిర్వహణ తగాదా విషయం ఒకటట. ఈ తగాదాను భారతకాంగ్రెస్ అగ్రనాయకులలో అనగా డా॥ పట్టాభి సీతారామయ్య సర్దార్‌వల్లభాయిపటేల్ వంటి వారికి నివేదించి, 'వారిచ్చు తీర్పునకు ఉభయపక్షాలు బద్ధులైఉండాలని నేటి సాయంకాలం సమావేశంలో ఒక సూచన చెయ్యబడిందని తెలుస్తున్నది.

## బళ్లారిని పూర్తిగా కర్నాటకంలో కలపాలట
### జిల్లాబోర్డు తీర్మానం

బళ్లారి, నవంబరు 15: నిన్న జరిగిన బళ్లారి జిల్లాబోర్డు సాధారణ సమావేశ అంత్యంలో, అజెండాలో లేని ఒక తీర్మానమును ఇటీవల ఏకగ్రీవంగా ఉపాధ్యక్షుడుగా ఎన్నికైన రంగనగౌడుగారు ప్రతిపాదింపగా, 17 మంది సభ్యులు, తీర్మాన ప్రతిపాదనను ప్రతిఘటించిరి. 28 మంది ప్రతిపాదన కామోదము తెల్పగా, అధ్యక్షులైన వై. మహాబలేశ్వరప్పగారు తమ ఓటునుకూడ అనుకూలముగా ఇచ్చినందున, 29 మంది ఆమోదముతో సదరు తీర్మానము బోర్డు సమావేశంలో నెగ్గెను.

"కాంగ్రెసు పరిపాలనలో భాషాభిప్రాయుక్త రాష్ట్రము లాచరణలోవున్నప్పటికీ, అధికారమునకు వచ్చి మూడేళ్ళయిననూ కాంగ్రెసు ప్రభుత్వము వారా సిద్ధాంతము నమలు పరచకుండుట శోచనీయము, థార్ నాయకత్రయ సంఘముల వారి సంకోచములు నిర్హేతుకములని, తదుపరి జరిగిన ఉదంతముల వలన విదితమే. కావున వెంటనే కర్నాటక రాష్ట్రమును మైసూరు సంస్థానము, యావత్తు బళ్ళారి జిల్లాలతో స్థాపింపవలెనని కేంద్రప్రభుత్వమును, కాంగ్రెసు కార్యవర్గమును, రాజ్యాంగ ప్రణాళిక సభాధ్యక్షులను, యీ జిల్లాబోర్డువారు కోరుచున్నారు.

నూతనరాజ్యాంగ చట్ట మమలులోనికి వచ్చులోగా అట్లు చెయ్యవలెను. బళ్ళారి జిల్లానుకాని, లేక దానిలో కొంతభాగమునుకాని రాబోవు ఆంధ్రరాష్ట్రములో చేర్చవద్దని మద్రాసు ప్రభుత్వమువారినీ బోర్డువారు కోరుచున్నారు. అట్లే కారణముచేనైనా చేర్చిన, దానివలన అనర్థము లేర్పడునని సూచించు చున్నారు."

అజెండాలో లేని, యీ తీర్మానమును తర్కించుట కనుమతి నొసంగరాదని హెచ్. రామలింగారెడ్డిగారు ప్రతిఘటించిరి. తీర్మానమును తేవచ్చునని అధ్యక్షులు రూలింగునిచ్చిరి. 28 మంది అనుకూలురుగను, 17 మంది ప్రతికూలురుగను ఓటు చెయ్యగా, అధ్యక్షుడు తమవోటును కూడ అనుకూలురకిచ్చి, 29 మంది మెజారిటీతో తీర్మానము చర్చకు రాదగునని ప్రకటించిరి.

ప్రతికూలురు 17 మంది ఒక ప్రత్యేక కాగితముపై తమ ప్రతిఘటన కారణములను పొందుపరచుచు దస్కతులుచేసి అధ్యక్షునకియ్యగా, వారు దానిని స్వీకరించిరి. దస్కతుచేసినవారిలో బళ్ళారి ఛేర్మన్ శ్రీ ముండ్లూరు గంగప్ప, అదవాని తాలూకాకాంగ్రెసు సభ్యక్షుడు పి. శంకరరెడ్డిగార్లున్నారు. (స్వ. వి.)

న్యూఢిల్లీ, నవంబరు 16:— ఇవ్వాళ్ళ తిరిగి రాజ్యాంగాన్ని గూర్చి చర్చించడానికి భారత రాజ్యాంగ పరిషత్తు సమావేశమైంది.

సభ ప్రారంభమైన అనంతరం 15 నిమిషాలకు పండిట్ నెహూ్రు పరిషత్తుకు వచ్చారు.

## కమ్యూనిస్టుల నిర్బంధించే విధానం
### కౌన్సిల్లో మంత్రిగారి వివరణ

మదరాసు, నవం 16: మదరాసుకౌన్సిలు నిన్న సమావేశమయినపుడు, కమ్యూనిస్టులను నిర్బంధించే విధానం గూర్చిన. వివరాలను ఆర్. సూర్యనారాయణరావుగారి ప్రశ్నలకు బదులుగా చెప్పిరి. 10 జిల్లాల అధికారులు ఎవరినైనా ప్రజారక్షణకై నిర్బంధించినపుడు కారణాలు వ్రాతమూలకంగా ప్రభుత్వానికి పంపుచున్నారు. సరియగు కారణాలుండియే నిర్బంధించుచున్నారని ప్రభుత్వానికి అందువల్ల తెలియగలదు. ఆ కారణాలు నిర్బంధితునకు కూడ తెలియజేయబడును. అవన్ని అబద్ధాలని అతను జవాబు పదిరోజులలోగా జిల్లా కలక్టరుకి పంపును. అవన్ని సలహా సంఘ విచారణకు పంపుచున్నాము. నిర్బంధితులకు కారణాలు తెలుపుటలో ఆలస్యం చేయరాదని ఉత్తరువులు చేయబడెను. హైదరాబాదు అల్లరులు రేగినపుడు కొంచెం ఆలస్యమయినది కాని యిపుడాలస్యములేదు. సలహా సంఘాలు యిపుడు రెండు నియమింపబడినవి. అందు హైకోర్టు జడ్జీలు గూడ కలరు. వారి అభిప్రాయాలను ప్రభుత్వం వారు గౌరవించుచున్నారు."

"వారి సలహా ఏ సందర్భంలోనైన నిరాకరించిరా—అని డా॥ వి. కె. జానుగారడుగగా, ఆ విషయం చెప్పరాదని మంత్రి మాధవమీనను గారనిరి.

### పింఛనుదారుల కరువుభత్యాలు

పింఛనుదారులకు మదరాసు ప్రభుత్వం వారు రూ. 106 లోపు నెలపింఛను గలవారికే రూ. 4, 5, 6 చొప్పున తరగతి వారిగా కరువుభత్యాలుయిస్తున్నారనియు, 1948 జనవరినుండి ఆదివరకుకన్న తగ్గించి పైరేట్లు యివ్వబడుచున్నవనియు ఇతర రాష్ట్రాలలో యిట్లే యిచ్చుచున్నారనియు యింతకన్న యెక్కువ యివ్వలేమనియు, ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు, వేరొకరిప్రశ్నకు బదులుచెప్పిరి.

పేదపింఛను దారులకు ఎక్కువ ఇవ్వరాదాయని భీమారావుగారడుగ మద్యనిషేధంవల్ల రాష్ట్రప్రభుత్వం పేదఅయిందని మంత్రిగారనిరి.

డా॥ ఆ. ల. క్షేమదల్వారు - ప్రశ్నలు వేస్తున్న సభ్యులే సంపూర్ణ మద్యనిషేధానికి కారకులుకారా?

ప్రాతిరేట్లు యిచ్చినచో 10 లక్షలు అదనం ఖర్చగునని యు, పన్నులు ఎక్కువ వేయవలసి యుండుననియు మంత్రిగారు ఉపప్రశ్నలకు బదులుచెప్పిరి.

మాజీసిపాయిలకు యిచ్చిన పొలాలు, వారు యితర భూములు లేనివారయినచో రాజకీయ బాధితుల కిచ్చుటకై వాటిని తిరిగితీసుకొనరాదని మదరాసు ప్రభుత్వం వారు జిల్లాకలెక్టరులకు ఉత్తరువు చేసిరని రివిన్యూమంత్రిగారు కల్లుబువాలా సతిగారికి బదులు చెప్పిరి.

హైవేసుశాఖలో డివిజను ఇంజనీర్లు అసిస్టెంటు ఇంజనీరులను నియమించుటకు నిబంధనలు ఇంకను తయారు కాలేదనియు స్థానిక సంస్థల ఇంజనీరుల సర్వీసు నిబంధనలే వీరికి అంతవరకు వర్తింప జేయుచున్నారనియు, సగంమందిని యోగ్యతను బట్టి ప్రమోషనులు యిచ్చి, సగంమందిని కులతత్వాల జి. ఓ. ప్రకారం నియమించిరనియు, మంత్రి భక్తవత్సలంగారు ఒక సభ్యునికి బదులు చెప్పిరి. స్థానిక సంస్థల ఇంజనీరుల కన్న హైవేసుశాఖ జీతాలు ఎక్కువేననిరి.

### వ్యవసాయ నూతులకు సహాయం

మదరాసు ప్రభుత్వంవారు వ్యవసాయదారుల నూతులకిచ్చే ధనసహాయం దుర్వినియోగంచేయబడినట్లు అట్టి కేసులు విన రాలేదనియు, కేంద్ర ప్రభుత్వంవారు యిందుకై యిచ్చే సగంఖర్చు ద్రవ్యరూపంలో గాక, కిస్తురిమిషను మున్నగు పద్ధతులలో యికముందు యివ్వదలచిరనియు, మదరాసు రాష్ట్రంలో మాత్రం యికముందు కూడ ద్రవ్యరూపంలో యివ్వడంగూర్చి ఆలోచింతుమనియు రివెన్యూ మంత్రిగారు మో. నారాయణ రావుగారికి బదులు చెప్పిరి.

ద్రవ్యం దుర్వినియోగం కాకుండా ప్రభుత్వంవారే నూతులు త్రవ్వించి యివ్వరాదాయని ఫరూకీగారడుగ, యితర విధములగు చెరువుల మరమ్మతు వగయిరా కార్యములందు ప్రభుత్వ సిబ్బంది నిమగ్నమయి యున్నందున యీపని చేయజాలరనిరి.

### హైద్రాబాద్ క్రికెటు జట్టు

హైదరాబాద్, నవంబరు 15: డిసెంబరు రెండవవారంలో సి. పి. బీరారు క్రికెటు జట్టుతో పోటీ చేయబోతున్న హైదరాబాద్ క్రికెటుజట్టుకు ఇ. బి. అయిబారా నాయకుడుగా ఎన్నుకోబడెను. హైదరాబాద్ జట్టుకు గత సంవత్సరంకూడ యితడే నాయకుడుగానుండెను.

విజయవాడ రోటరీక్లబ్బు 13 వ తేదీ సమావేశంనాడు తీయబడిన చిత్రం. దానికి హాజరైనవారిలో రోటరీ గవర్నరు డి. ఎస్. హోసలీ, ఎస్. ఆర్. శర్మ, డా॥ చాగంటి సూర్యనారాయణమూర్తి, డా॥ ఎం. శాస్త్రి, గారలనయిందులో కానవగును.

# "పాలితదేశాల ఆర్థికాభ్యుదయం కంటే స్వాతంత్ర్యం ప్రధానం"

## సమితిచర్చలో భారతప్రతినిధి ఉద్బోధ

ప్లషింగు మెడోస్, నవంబరు 15: నేడు ఐక్యరాజ్యసమితి చర్చలో పాల్గొంటూ భారతప్రతినిధి రివరెండు డిసూజా, ధర్మకర్తృత్వ ప్రాంతాలను పాలించే దేశాలు తమకిందఉన్న ప్రాంతాల స్వాతంత్ర్యం సాధ్యంచేయడానికి ఏమి ప్రణాళికలు తయారుచేసినదీ ఒక సంవత్సరం గడువులోగా నివేదించాలనీ, వారావిధంగా ప్రణాళికలు నివేదించ నిరాకరించినట్లయితే వారి ఉద్దేశాలను శంకించడానికి అవకాశం ఏర్పడుతుందనీ అన్నారు.

జెనుక జర్మనీ కింద ఉండిన కాలనీలు వివిధ ప్రభుత్వాల ధర్మకర్తృత్వం కిందకు తీసుకొని రాబడినవి. అందుచేత వీటిపై భిన్నసిద్ధాంతాల ప్రభావం పనిచేసి భిన్న రాజకీయ పరిణామాలు జరిగే అవకాశం వున్నది. సకాలంలోనే ఈ ప్రాంతాల అభివృద్ధి పథకాలు ఐక్యరాజ్యసమితికి చేరినట్లయితే ఈ వ్యత్యాసాలు ఏర్పడకుండా చూసే అవకాశం, వీటి ఐక్యతకు భంగం లేకుండా, అన్నిప్రాంతాలూ ఒకేవిధంగా రాజకీయ పరిణతి పొందే అవకాశమూ ఉండగలదు.

"పాలితరాజ్యాల విద్యా ఆర్థికాభివృద్ధి కంటె కూడా రాజకీయ స్వాతంత్ర్యం చాలా ప్రధానమైనది. మాటవరసకు, నిరక్షరత తొలగేదాకా స్వాతంత్ర్యం ఇవ్వరాదనే సిద్ధాంతాన్ని మా ప్రతినిధివర్గం ఆమోదించదు. పత్రికలద్వారానూ, రాజకీయ సాహిత్యం ద్వారానూ మాత్రమే ప్రజలకు ప్రజాస్వామ్యం బోధించాలని లేదు. రాజకీయసభలూ, ఉపన్యాసాలూ, నాయకులకూ ప్రజలకూ మధ్యసన్నిహిత సంబంధాలూ ఉంటే చాలు. ఇండియా నిరక్షరత తొలగకపూర్వమే వయోజన వోటింగుపద్ధతిగల రాజ్యాంగం రచించుకొన్నది. ఆర్థికాభివృద్ధికన్న స్వపరిపాలన ప్రధానం.

"ధర్మకర్తృత్వ దేశాలలో ముడిసరుకులు ఉత్పత్తిచేసి ఆ దేశాలకు ఉత్పత్తి సరుకులు ఎగుమతి చేయాలనే ధోరణి అపాయకరమైనది. ఈ అపాయానికి విరుగుడు మహాత్మాగాంధీ బోధించారు. గ్రామాలకు ఆహార స్వయం సమృద్ధి కలిగించి, గృహపరిశ్రమలను పెంచడమూ, పెద్ద పరిశ్రమలను వికేంద్రీకరించి సహకారపద్ధతిపై ఆర్థికవ్యవస్థ నెలకొల్పడమూ సరియైనపద్ధతి. ధర్మకర్తృత్వ ప్రాంత ప్రజల శారీరకనైతికబలం పెంపొందడం సూతనోత్పత్తికంటె కూడా అత్యవసరం. ప్రజలు కేవలము యంత్రదాస్యంలో గడపకుండా తగినంత సంపదను సృష్టిచేసుకొని జీవనప్రమాణాలు అభివృద్ధి చేసుకోవాలి." అని రివరెండు డిసూజా అన్నారు.

### "సివిల్ మిలిటరీ గెజెట్ అమ్మకం చెల్లదు"

కరాచీ, నవంబర్ 15: లాహోరు నుంచి, ప్రకటించబడుతున్న, రామకృష్ణ డాల్మియా తాలూకు 'సివిల్ అండ్ మిలిటరీ గెజెట్' అనే పత్రికను అమెరికా 'స్టార్ డెస్పు కార్పొరేషన్' వారికి అమ్మివేశారు. ఈ అమ్మకాన్ని అంగీకరించటానికి వీల్లేదని చెబుతూ పాకిస్థాన్ స్టేట్ బ్యాంకువారు ఇలా ప్రకటించుచున్నారు.

'ఈ ఆస్తిని ఇలా అమ్మకం చేయటానికి, న్యాయ రాష్ట్ర శాఖా అనుమతి వారు పొంద లేదు. అలాంటి అనుమతి పొందుకు ఎట్టి విజ్ఞప్తి వారిలు కాలేదు. అందుచేత యీ అమ్మకాన్ని అంగీకరించటానికి సావకాశం లేదు.'

## కమ్యూనిస్టు చైనా పరిగణన సమస్య

### బెవిన్‌తో కామన్వెల్తు హైకమిషనర్ల చర్చలు

లండన్, నవంబర్ 15. లండన్‌లో వున్న కామన్వెల్తు రాజ్యాల హైకమిషనర్లు ఈవేళ బ్రిటిష్ విదేశాంగమంత్రి ఎర్నెస్టు బెవిన్ను కలుసుకొని సంప్రదిస్తున్నారు. చైనా కమ్యూనిస్టుప్రభుత్వాన్ని గుర్తించటంలోగల సాధకబాధకాలను గురించి ఆలోచించటానికి వీరు సమావేశమౌతున్నట్టు నమ్మదగినవర్గాలవల్ల తెలుస్తున్నది. ఇది విదేశాంగశాఖ అధికారులకూ కమిషనర్లకూ మధ్య జరుగుతూండే సాధారణ సమావేశంగాదు. చైనా సమస్యను చర్చించటానికి ప్రత్యేకంగా ఏర్పాటైన సమావేశం.

ఈ సమావేశంలో, కొలంబోలో జరగనున్న కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశంయొక్క కార్యక్రమ ప్రణాళిక కూడా నిర్ణయం కావచ్చును.

జనవరిలో జరుగనున్న ఈ సమావేశంలో పాల్గొనటానికి బ్రిటన్‌కూడా అంగీకరించింది.

## నెల్లూరు జిల్లా బోర్డు ఉపాధ్యక్షత

### వేమారెడ్డి శ్రీనివాసులు రెడ్డిగారి ఎన్నిక

నెల్లూరు, నవంబరు 15:— నెల్లూరు జిల్లా బోర్డు నేటి సాయంత్రం సమావేశమైనది. ఉపాధ్యక్ష స్థానమునకు కాంగ్రెస్ అభ్యర్థియైన వేమారెడ్డి శ్రీనివాసులు రెడ్డిగారి పేరు టి. ఇబ్రహీంగారు ప్రతిపాదించారు. బత్తిన రామకృష్ణారెడ్డిగారు బలపరిచారు. శ్రీనివాసులు రెడ్డిగారు ఉపాధ్యక్షుడుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడినట్లు ప్రకటింపబడింది.

## పరిషత్‌లో భోపాల్ సభ్యుడు

న్యూఢిల్లీ, నవంబర్ 15:— ఈ వేళ రాజ్యాంగ పరిషత్సమావేశంలో భోపాల్ ప్రతినిధి ఠాకూర్ లాల్సింగ్ తన స్థానాన్ని స్వీకరించారు.

ఇంకా పరిషత్తులో ప్రాతినిధ్యంలేని సంస్థానాలు రెండు — హైదరాబాద్ వింధ్యప్రదేశ్. హైదరాబాద్ విషయమై తానేమీ చెప్పలేననీ, వింధ్యప్రదేశ్‌లో తాను సూచించిన ఎన్నికల పద్ధతికి అక్కడి రాజకీయ పక్షాలు అంగీకరించలేదనీ, అందువల్ల నవంబర్ 20 వ తేదీలోగా ప్రతినిధులు నామినేషన్ దరఖాస్తులను పంపాలని కోరాననీ డా॥ రాజేంద్రప్రసాద్ తెలియజేశాడు.

ఈ సూత్రాన్ని ముసాయిదాలోనుంచి తొలగించాలని పండిత ఠాకూర్దాస్ భార్గవా ఒక సవరణను ప్రతిపాదించాడు. ఈ సూత్రం లేకుండానే అవసరమైనప్పుడు రాష్ట్ర వ్యవహారాల్లో జోక్యం గలిగించుకునే అవకాశం ఉన్నదని ఆయన వాదించాడు. ముసాయిదాలోనుంచి తొలగించటంలోగల నిర్ణయాలకు విరుద్ధమని కె. సంతానం అన్నాడు.

# "మాట్లాడేది శాంతిగురించి చేసేది యుద్ధప్రయత్నాలా"

## సమితి రాజకీయసమితిలో రష్యాపై యుగోస్లావియా ఆరోపణ

లేక్‌సక్సెస్, నవంబరు 15: రష్యా వివిధప్రపంచ సమావేశాలలో శాంతిని గురించి మాట్లాడుతూనే యుగోస్లావియాలోని టిటో ప్రభుత్వంపై తీవ్రమైన ప్రచారం సాగిస్తుందని, ఐక్యరాజ్య రాజకీయ సమితిలో యుగోస్లావియా ప్రతినిధి విమర్శించాడు.

రాష్యా శాంతిసూచనపై జరిగిన చర్చలో ఆయన ఇంకా ఈ విధంగా మాట్లాడాడు.

"నిన్న సమితిలో అంద్రీవిషిన్‌స్కీ (సోవియటుప్రతినిధి) చేసిన ప్రసంగం నిండా శాంతి అనేమాట విరివిగా వాడబడినప్పటికీ ఆ ప్రసంగం పెక్కు అడుగు ముందుకు వేయనంలేదు.

"యుగోస్లావియా ప్రతినిధులను విషిన్‌స్కీ టిటో ముఠా అన్నారు. యుగోస్లావియాలోని సక్రమ ప్రభుత్వంపట్లా, ప్రజలపట్లా, స్వాతంత్ర్య పట్లా రష్యా ప్రభుత్వానికిగల వైఖరిని ఐక్యరాజ్య సమితిలో విషిన్‌స్కీ ప్రయోగించేమాటలే సూచించు చేస్తున్నవి.

"ఆ శ్వేని నాను విశదించడానికి యుగోస్లావియా సిద్ధంగాఉన్నదని విషిన్‌స్కీ గ్రహించాలి. ఆల్బేనియాపట్లగాని ఇతర పరిసర రాజ్యాలపట్లగాని, యుగోస్లావియాకు ఎట్టి దురాక్రమణ వాంఛకూడాలేదు. కాని యుగోస్లావియా సరిహద్దులపై రష్యా, బల్గేరియా, హంగరీ, రుమేనియాల సైన్యాల సంచలనం జరుగుతున్నది. పరిసరరాజ్యాలు యుగోస్లావియాపై ఆర్థిక దిగ్బంధం సాగిస్తున్నవి.

"రష్యా చేతలకూ మాటలకూ వ్యత్యాసం ఉన్నది కనుక సోవియటు ప్రతిపాదనను సమగ్రంగా యుగోస్లావియా ఆమోదించజాలదు. ఆంగ్లో అమెరికను ప్రతిపాదన ప్రచ్ఛన్నయుద్ధ సమస్యను పరిష్కరించదు, కనుక దానిని కూడా యుగోస్లావియా కేవలంగా ఆమోదించజాలదు."

నిన్న ఈ రాజకీయ సమితిలో రష్యా ప్రతినిధి అంద్రీవిషిన్‌స్కీ శాంతి ప్రతిపాదనచేస్తూ, అమెరికా బ్రిటనులలో జరిగే యుద్ధప్రయత్నాలను ఐక్యరాజ్య సమితి ఖండించాలనీ, బ్రిటను ఫ్రాన్సు చైనా రష్యా అమెరికాలమధ్య శాంతి ఉండేటట్టు ఆదేశించాలనీ అన్నారు. దానిపై నేడు చర్చ ప్రారంభమయింది.

## ఢిల్లీకి నెహ్రూ ఆగమనం

### ఘనస్వాగతం

### రాజాజీ ప్రభృతులతో గోష్ఠి

న్యూఢిల్లీ, నవంబరు 15:

భారత వైమానిక దళమునకు జెందిన డకోటావిమానము ఒక గంట పూర్వమే విమానాశ్రయములో నిర్మింపబడిన పందిరి జనాకీర్ణమై యుండెను. దానిలో యిసుక రాలుటకు గూడ స్థలము లేకపోయెను. ఆ హూతులలో దాదాపు అందరు వచ్చి పండితుని రాకకై ఆతురతతో వేచియుండిరి. గవర్నరు జనరలు శ్రీ రాజాజీ విద్యాశాఖ మంత్రి యగు మౌలానా అజాద్ గారితో కలిసి డకోటావిమానము 20 నిమిషములు పూర్వము విమానాశ్రయము వద్దకు వచ్చిరి. పండిత నెహ్రూ విమానమునుండి దిగగానే ముగ్గురు భారత సేనాధిపతులు, జనరల్ కరియప్ప, వైస్ అడ్మిరల్ ప్యారీ సర్ థామస్ ఎల్మహర్స్టు గారలును, గవర్నరు జనరలు సైనిక కార్యదర్శి కర్నల్ ఛటర్జీ, స్టేషను కమాండర్ కెప్టెన్ కున్వర్ అశ్వంత్ గారు వారికి స్వాగతమొసంగిరి. అంతట భారత విమానదళము వారి అభివాదనములను, సైనికులందరి ఆశీర్వాదనములను ప్రధాని స్వీకరించెను. ఆటు తరువాత ప్రధాని గవర్నరు జనరలును, మంత్రులను కాంగ్రెస్ నాయకులను విదేశీ రాయబారులను కలిసికొన బోయెను. మొదట గవర్నరుజనరలు వారికి స్వాగతమొసంగి పుష్పమాల వైచిరి. తరువాత సర్దార్ పటేలు మందహాసభాసురవదనారవిందముతో వారిని కౌగిలించుకొని అనురాగాతిశయముతో ఆయన వీపుపై అనేకసార్లు తట్టెను. కాశ్మీరు ప్రధాని షేక్‌మహమ్మద్ అబ్దుల్లాగారు పండితునికి స్వాగతమొసంగి కాశ్మీరులలో తప్ప మరెచ్చటను లభ్యముకాని కుంకుమపూవుల దండచే వారి కంఠము నలంకరించిరి. నెహ్రూతోడి మంత్రులు, రాజ్యాంగపరిషత్ సభ్యులు, సేనాపతులు, కాంగ్రెస్ నాయకులు, ఉన్నతాధికారులు, అనధికార సంస్థల నాయకులు నెహ్రూకు పుష్పమాలలు వైచుటలో అహమహమికజూపిరి. ఢిల్లీ రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘమువారు తమ అధ్యక్షుడగు రాధారమణ్‌గారి నాయకత్వమున పండితునికి స్వాగత సత్కారములు గావించి పూర్వము జయలక్ష్మితో తిరిగివచ్చు వీరునికవలె పండితుని నుదుట కుంకుమబొట్టు పెట్టిరి. పండితుడు అందరికిని వందనము గావించెను. అందరి కరములను స్పృశించెను. ప్రధాని కరస్పర్శ గావించు ఉద్దేశ్యముతో ఒక చిన్న పిల్లవాడు పాఠశాలలో చదువుకొను బాలుడు తన చేయిచాచగా ప్రధాని ఆతురతతో ఆతనివద్దకువెళ్ళి ఆతని కరస్పర్శ గావించెను. కాంగ్రెస్ మహాసభాధ్యక్షులగు డా॥ పట్టాభి సీతారామయ్యగారు పండితునికి సుస్వాగత మొసంగుచు అద్‌సాహీ సలామత్ సెంచగయే హై అని హిందుస్థానీలో చెప్పిరి. చైనాయందలి భారత రాయబారి సర్దార్ పణిక్కర్ పండితునికి స్వాగతము చెప్పుచు విదేశములలో చరిత్రాత్మకమగు పర్యటనము గావించినందులకు వారి నభినందించిరి. ప్రధానిని బాగా చూచుటకు పందిరిలోనివారు తమ స్థానములను వదలి పెట్టిరి. ప్రక్కనున్న ఒక పాఠశాలవిద్యార్థులు విమానాశ్రయములోనికి తోసుకొనివచ్చిరి. ప్రధాని జనసమూహములలో కలిసిపోయెను. వారిపై పుష్పములజల్లు కురిసెను. తరువాత ఆయన విమానమువద్దకు వెళ్ళి విమానచోదకులకు కృతజ్ఞతదెలిపి కొన్ని నిమిషములైన తరువాత తన నివాసమునకు మోటారులో వెళ్ళిపోయెను.

### నెహ్రూ గౌరవార్థము గవర్నర్ జనరల్ విందు

న్యూఢిల్లీ, నవంబరు 15: అమెరికా పర్యటనము జయప్రదముగా ముగించుకొని భారతదేశము తిరిగివచ్చిన ప్రధాని పండిత నెహ్రూ గౌరవార్థము గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు నేటి సాయంకాలము ప్రభుత్వభవనములో విందుచేసిరి. మంత్రులు, విదేశముల రాయబారులు, ఉన్నత సివిల్, మిలిటరీ అధికారులు, ప్రముఖులు మున్నగువారు వేయికిపైగా విందుకువచ్చిరి.

### బేసిక్ విద్యాలయములు

మదరాసు, నవంబరు 15: ఈ సంవత్సరము ప్రభుత్వము 9, పైవేటుసంస్థలు 2 బేసిక్ విద్యాలయములను ప్రారంభించెను. మొత్తం 33 పాఠశాలలున్ననదియు ఇందు 28 ప్రభుత్వ యాజమాన్యముక్రింద వున్నవని నేడు అసెంబ్లీలో విద్యామంత్రి ఒక సభ్యునిప్రశ్నకు జవాబు ఇచ్చిరి.

## రెండు తలల శిశువు

### జగ్గయ్యపేటలో ప్రకృతి వైపరీత్యం

జగ్గయ్యపేటలో 12 వ తేదీ రాత్రి ఒక స్త్రీ ప్రసవసమయములో 4 కాళ్ళు కనబడుటచే 2 కాళ్ళు ఆపరేషన్‌చేసి బైటికి తీయగా 2 రొమ్ములు కలసి 2 తల కాయలు ఒకే వైపుకుగల కవలపిల్లలు చనిపోయి పుట్టిరి. ఈసంఘటనచూచుటకు వేలాది ప్రజలు వచ్చుచుండుటచే మెటర్నిటీ ఆసుపత్రివారు ఈరోజు పగలెల్ల అందరికి చూపిరి.

# రాష్ట్రాల్లో కేంద్రనిర్ణయాల నిర్వహణ బాధ్యత

## రిపబ్లిక్ అధ్యక్షుని అధికారంపై రాజ్యాంగ పరిషత్తు చర్చ

న్యూఢిల్లీ, నవంబర్ 15: నేడు భారత రాజ్యాంగపరిషత్తు నూతన రాజ్యాంగపు కొత్తముసాయిదాపై చర్చను జరుపుతూ, ముసాయిదా సంఘం ప్రతిపాదించినకొత్త సూత్రంమీద చర్చజరిపినది. యూనియన్ ప్రభుత్వం ఇచ్చే ఆదేశాలను ఏరాష్ట్ర ప్రభుత్వమైనా అమలుజరపక పోతే అక్కడ నూతన రాజ్యాంగము ననుసరించి పరిపాలన జరపటానికి వీలులేని పరిస్థితి ఏర్పడినట్లు ప్రకటించే అధికారాన్ని రిపబ్లిక్ అధ్యక్షుడికి ఇస్తూ ముసాయిదా సంఘం 365 వ సంఖ్య కింద ఒక కొత్త సూత్రాన్ని రాజ్యాంగంలో చేర్చాలని ప్రతిపాదించగా దాని మీద విశేషంగా చర్చజరిగింది.

రాష్ట్రాల షెడ్యూల్‌లో యునైటెడ్ ప్రావిన్స్ సెంట్రల్ ప్రావిన్సెస్ అన్న పేర్లను మార్చేవిషయమై కూడా కొంత చర్చ జరిగింది.

నూతనరాజ్యాంగ ముసాయిదాసవరణలపై రాజ్యాంగ పరిషత్తు నేడుచర్చను కొనసాగించినది. 320వ సూత్రం మీద ఒక కొత్త సవరణ ప్రతిపాదించబడినది కనుక ఆ సూత్రం మీద చర్చను తరవాతకు వాయిదా వేయాలని ముసాయిదా సంఘం తరపున టి. టి. కృష్ణమాచారిగారు కోరగా అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ అంగీకరించాడు.

హింసేతరభాషలను మాట్లాడే ప్రజల హక్కులను రక్షించటానికై, జాతీయ భాషకు సంబంధించిన నిబంధన కింద రిపబ్లిక్ అధ్యక్షుడు రాజ్యాంగం అమలు జరిగిన 15ఏళ్ళ తరవాత నియమించే ప్రత్యేక సంఘం బాధ్యత వహించాలని హెచ్. వి. కామత్ గారొక సవరణను ప్రతిపాదించాడు. ఢిల్లీ, బీహారు, మొదలైన హిందీ ప్రాంతాల్లో కూడా హిందేతరభాషలు మాట్లాడే ప్రజలు ఉన్నారని ఆయన అన్నాడు.

### రాష్ట్రపాలకులు: కేంద్రానికి విధేయత

కొత్త ముసాయిదాలో ముసాయిదా సంఘం ప్రతిపాదించిన 365వ సూత్రం మీద కొంత చర్చ జరిగింది. "రాజ్యాంగ ప్రణాళిక ననుసరించి యూనియన్ ప్రభుత్వం ఇచ్చిన ఉత్తరువులను రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహించకపోతే, ఈ రాజ్యాంగానుసరించి ఆ రాష్ట్ర పరిపాలన జరగరాదని ప్రకటించే అధికారం రిపబ్లిక్ అధ్యక్షుడికి ఉన్నది" అని ఈ సూత్రం నిర్దేశిస్తున్నది. ఈ సూత్రాన్ని ప్రతిపాదించటంలో ముసాయిదా సంఘం తనకి ఇచ్చిన హద్దుదాటి పోతున్నదని కుంజ్రూ విమర్శించాడు. దీనికి అంబేద్కర్ జవాబిస్తూ, ఆర్థిక అవాంతరాలు సంభవించినప్పుడు ఈ విధంగా ప్రకటించే అధికారం 280 (ఎ) సూత్రంలో అధ్యక్షుడికి ఇవ్వబడ్డదనీ, రాష్ట్రాలకిచ్చే ఉత్తరువుల విషయమై మొదటి షెడ్యూల్ 2వ భాగంలో కూడా ఈ అధికారం ఇవ్వబడ్డదనీ అన్నాడు. దానిమీద పండిత కుంజ్రూ ఈ సూత్రంలో చెప్పిన భావమూ, ఆసూత్రాల్లో చెప్పిన భావమూ అర్థం భేదిస్తున్నదనగా అధ్యక్షుడు భేదించటం లేదని ఆక్షేపణను త్రోసివేశాడు.

మైసూర్ ప్రతినిధి హనుమంతయ్యగారు సూత్రాన్ని సమర్థిస్తూ, ప్రస్తుతం కేంద్రప్రభుత్వాన్ని చేజిక్కించుకున్న ప్రత్యేక వర్గాలు, తరగతుల స్వార్థం కోసం దానిని వినియోగించటం జరిగితే అది ఇండియా ఐక్యతనే భగ్నం చేయగలదని హెచ్చరించారు. కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకన్నా ఉత్తమంగా నడుస్తున్నదని అనుకోకూడదనీ, రాష్ట్ర ప్రభుత్వాలు రాష్ట్ర ప్రజలకే బాధ్యులనీ, కేంద్రం ఎప్పుడూ వాటిని కనిపెట్టి ఉండ నవసరం లేదనీ ఆయన అన్నాడు.

మహావీర్‌త్యాగి సూత్రాన్ని సమర్థించాడు. పండిత కుంజ్రూ, పండిత భార్గవా సవరణను సమర్థిస్తూ ఈ సూత్రం కేంద్ర ప్రభుత్వాధికారాలను విస్తరింపజేస్తున్నదన్నాడు. డిఫెన్సుకు సంబంధించిన శాసనాలను చేసే అధికారం కొత్త రాజ్యాంగం అమలుజరిగిన ఏడాదివరకూ అధ్యక్షునికి ఇవ్వబడ్డదనీ, గడువును మూడు నెలలకు తగ్గించాలని ప్రొ॥ శిబన్లాల్ శాక్సేనా వాదించాడు.

మొదటి షెడ్యూల్‌ను సవరించటానికై 391 వ సూత్రాన్ని పురస్కరించుకుని అధ్యక్షుడు తీసుకునే చర్యలన్నీ రెండు నెలలలోగా పార్లమెంటు ఆమోదానికి ప్రతిపాదించాలని ఆర్. కె. సిధ్వా ఒక సవరణ ప్రతిపాదించాడు డా॥ రాజేంద్రప్రసాద్ జోక్యం కలిగించుకుని, కొత్త రాజ్యాంగం అమలు జరక్కముందు గవర్నర్ జనరల్ తీసుకునే చర్యలను గమనించి దానినిబట్టి షెడ్యూలును సంస్కరించే విషయంలోనే ఈ 391 వ సూత్రం నిర్దేశిస్తున్నదని వివరించాడు.

### పేర్ల మార్పు

సెంట్రల్ ప్రావిన్సెస్ అని ఇప్పటివరకూ వాడుకలో ఉన్న ప్రాంతాన్ని కోసల-విదర్భ అని పిలవాలని రాజ్యాంగ ముసాయిదా ప్రతిపాదించినది. దానిని మధ్యప్రదేశ్అని మార్చవలెనని హెచ్. వి. కామత్ ఒక సవరణను ప్రతిపాదించాడు. ఈ మార్పుకు మధ్యరాష్ట్రాల ప్రభుత్వం అంగీకరించినట్లు తెలియవచ్చినది. కనుక ముసాయిదా సంఘం అవసరమైన మార్పు చేస్తుందని డా॥ రాజేంద్రప్రసాద్ వల్లడించాడు.

యునైటెడ్ ప్రావిన్సెస్‌ను "ఆర్యావర్త" అనే పేరు పెట్టాలని ఒక ఆలోచన ఉన్నదనీ, జాత్యహంకారాన్ని అది సూచించవచ్చును కనుక దీనిని 'గంగావర్త' అనే పిలవాలనీ కామత్ మరొక సవరణ ప్రతిపాదించాడు. ఆర్యావర్త అన్న పేరులో జాతి సూచకం ఏమీలేదనీ, ఆ పేరు ఉంచాలనీ ప్రొ॥ శిబన్లాల్ శాక్సేనా ఒక సవరణను ప్రతిపాదించాడు. టి. టి. కృష్ణమాచారి కోరికమీద ఈ అంశంమీద చర్చ రేపటికి వాయిదా వేయబడ్డది.

ప్రస్తుత న్యాయాధిపతులూ కొత్తగా నియమించబడే వారికీ, జీతాలలో చూపనున్న తేడాను తొలగించాలని కామత్ మరొక సవరణ ప్రతిపాదించాడు. ధరల కంట్రోలు కేవలం కేంద్ర ప్రభుత్వాధీనంలోనే ఉంచాలని ఆర్. కె. సిధ్వా ఒక సవరణను ప్రతిపాదించాడు.

ఏ వ్యక్తి అయినా డిస్మిస్ చేయబడే కాలానికి గరిష్ఠ ప్రమాణాన్ని నిర్ణయించే అధికారాన్ని పార్లమెంటు కిస్తూ టి. టి. కృష్ణమాచారి ఒక సవరణను ప్రతిపాదించాడు. వ్యక్తిని డిస్మిస్‌చేసిన మూడునెలలలో ఆరకికేసును ఎడ్వయిజరీబోర్డుకి ప్రతిపాదించాలని కామత్ ఒక సవరణను ప్రతిపాదించాడు.

పార్లమెంటు సమావేశాలకు రాజ్యాంగంలో నిర్ణయించబడిన 'కోరం'ను మార్చే అధికారం పార్లమెంటుకు లేకుండాచేయటానికి నజీరుద్దీన్ అహమద్ ఒక సవరణను ప్రతిపాదించాడు.

ఏ రాష్ట్రంలో నైనా ప్రభుత్వం రాజ్యాంగం ప్రకారం నడవడం గట్టి నమ్మకం కలిగినప్పుడుమాత్రమే అధ్యక్షుడు 365 సూత్రాన్ని, అనుసరించాలని హెచ్. వి. కామత్ ఒక సవరణనూ రాష్ట్ర ప్రభుత్వం యూనియన్ విధానానికి పూర్తిగా వ్యతిరేకించినప్పుడే ఉపయోగించాలని ఆర్. కె. సిధ్వా మరొక సవరణను ప్రతిపాదించారు.

బ్రజేశ్వర్ ప్రసాద్ ముసాయిదా సంఘ ప్రతిపాదనను సమర్థిస్తూ ప్రస్తుత పరిస్థితులకు అది అత్యవసరమని అన్నాడు.

బి. దాస్ కొత్త సూత్రాన్ని ప్రతిఘటిస్తూ ఇప్పటికే రాష్ట్ర ప్రభుత్వాలు మునిసిపాలిటీలకు సమం అయిపోయినవనీ, 1935 ఇండియా చట్టంలోని 93 వ సెక్షనును ప్రవేశపెడుతున్న కొత్త సూత్రాన్ని రాజ్యాంగంలో చేరిస్తే ఏర్పడేది ఫాసిస్టు డెమాక్రసీ మాత్రమేననీ విమర్శించాడు.

## రేడియో ప్రోగ్రాములు

నవంబరు 18 శుక్రవారం

### మద్రాసు (ఎ)

ఉ. 7-30 కమలా సాగరత్నం పాట 8-0 ఆంగ్లమున వార్తలు 8-15 ఉదయ సంగీతం (రి) 8-30 మద్రాసు (బి) వలె. మ. 1-30 ఆంగ్లమున వార్తలు 1-40 సినిమా సంగీతం (రి) 4-30 పాశ్చాత్య సంగీతం (రి) సా. 5-30 కమలా శంకర్ పాట 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 మన్నారుగుడి ఎస్. నాగరాజయ్యర్ పాట 7-30 జంత్రసమ్మేళనం 8-15 జె. సుబ్బలక్ష్మి వీణ 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 విశ్వవిద్యాలయాలకు, హిందీ కవిత్వము ఆంగ్లమున ప్రసంగం కె. సుందర రామశర్మ 9-30 మద్రాసు (బి) వలె.

### మద్రాసు (బి)

ఉ. 7-0 తెలుగున వార్తలు 7-15 అరియకుడి రామానుజయ్యంగార్ రికార్డులు 7-45 మద్రాసు (ఎ) వలె 8-30 బి. నాగేంద్రప్ప క్లారినెట్ మ. 12-0 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు గృహసుభ్రత ఇంటిలోపల ప్రసంగం సాంక్రమిక రోగములు కలరా డాక్టరుగారి ప్రసంగం 1-0 మదరాసు (ఎ) వలె 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు మా పూరు కాకినాడ ప్రసంగం. మన ఆహారము. ఆహారమనగాను ప్రసంగం. పాఠశాల దినచర్య. 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు దినచర్య సాలి ప్రసంగం ఎ. స్టీవర్ట్ బెంజిమన్ పాట కథ హంస తాబేలు సా 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం. భారతీయ వ్యవసాయ చరిత్ర మధ్యయుగము ప్రసంగం. ఈ మావిపైనుండి. బసవరాజు గేయం విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణ వివరాలు. 7-0 తెలుగున వార్తలు. 7-15 గ్రామస్థుల కార్యక్రమం ఈ సమయంలో భూగోళపరిస్థితి ప్రసంగం అంగతుకి దుర్వ్యాధి నివారణము. 7-45 కన్నడ ప్రసంగం, 8-15 మద్రాసు (ఎ) వలె. 9-30 శ్రోతలు కోరిన పాటలు. 10-0 మల్ల సూర్యనారాయణమూర్తి.

### విజయవాడ

ఉ॥ 7-0 తెలుగున వార్తలు. 7-15 ఎం. ఎస్. సుబ్బులక్ష్మి రికార్డులు. 7-30 మేదూరి నరసింహారావు వీణ. 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 గీతావళి కౌమరగిరి రామతిలకం. 8-30 కె. రంగస్వామి పాట మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు. 1-0 తారాపథం (రి). 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగునవార్తలు. 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు. 4-0 ప్రాథమికపాఠశాలా విద్యార్థులకు. సా॥ 5-30 చల్లపల్లి కృష్ణమూర్తిశాస్త్రి వయొలిన్. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతావళి కౌమరగిరి రామతిలకం. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. (మద్రాసు నుండి) 7-0 తెలుగునవార్తలు. 7-30 చిత్రవాణి (రి). 7-45 జానపద సాహిత్య ప్రచిత్రి తెనుగునుడికారము ప్రసంగం డా॥ చిలుకూరి నారాయణరావు. 8-0 మేదూరి నరసింహారావు వీణ. 8-30 కె. రంగస్వామి పాట. 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 నందనార్ చరిత్రము, హరికథా కాలక్షేపం. ఇనగంటి రామమూర్తి భాగవతర్.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 16:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతోసహా రు. 77-0-0 పెట్లా బంగారు తులం 115-4-0 మూసబంగారు 113-2-0 సీమవెండి తులం 100-కి (రెడీ) 168-0-0 వెండి తులం 1 కి 1-11 0

పంచదార

| | | |
|---|---|---|
| ప్యారీ (2 అంగుళ) | | రు. 91-14-6 |
| చక్కెర చిల్లరధర | వీశ 1-కి | 1 5.0 |

డిసంబరు వాయిదా ధరలు

న్యూయార్కు, నవంబరు 15:

| | | | |
|---|---|---|---|
| నేటి | ప్రారంభం | వెల | 29 88 |
| | నిన్న | | 29 39 |
| ,, | ముగింపు | వెల | 29.83 |
| | నిన్న | | 20.90 |

# 'తుపానుబాధితులకు సర్వవిధాల ప్రభుత్వం సహాయపడుతుంది'

## ఉదారముగా రెమిషన్లు ఇవ్వగలదని కౌన్సిలులో రెవిన్యూమంత్రి హామీ

చెన్నపట్నం, నవంబరు 15: తుపాను వచ్చిన ప్రాంతముల ఉదారముగా ప్రభుత్వం రెమిషన్లు ఇచ్చుననీ, సర్వవిధములా ఆర్తులకు తోడ్పడుననీ రెవిన్యూ మంత్రి సీతారామరెడ్డిగారు నేడు కౌన్సిలులో సభ్యుల విమర్శలకు సమాధానముగా తెలిపిరి.

మదరాసు కౌన్సిలులో మోతే నారాయణరావుగారు ఆంధ్రదేశంలోని తుపానుగూర్చి తమ ఉపన్యాసం కొనసాగించుచు, బియ్యంకొరకు దేవులాటలో తమ జిల్లాయందొకరు చనిపోయిరనియు, ధరలు విపరీతంగా పెరిగిపోయి మినప కాయలు పిశ 5½ బెల్లం 2-2-0 వరకు పెరిగినవనియు చెప్పిరి. వర్తకులను ఒత్తిడిచేసి ధరలు తగ్గించాలని సూచించిరి. మంత్రులెవ్వరు ఇప్పటికి తమ జిల్లాకు రావడం లేదని, కాఫీహోటళ్లు తెరచుటకు వైనుండిగాని తమ ప్రాంతంరాలేదని ప్రజలంటున్నారని ఉద్యోగులు చురుకుగ పనిచేయరని యు, తెలిపిరి. తుపానువల్ల ఎక్కువ నష్టపడిన 4 జిల్లాల ప్రతినిధి ఒక్కడుకూడ మంత్రివర్గంలో లేకపోవటంవల్ల యిట్లు జరుగుచున్నదనిరి. రిమిషనలు ఎక్కువగ యిచ్చి విత్తనాలు ఉచితంగా వెంటనే యీ నెలాఖరులోగా యివ్వాలనియు సూచించిరి. ఇపుడు సమయానికి సహాయంచేయకపోయినచో ప్రభుత్వంవారు కమ్యూనిజమును ప్రోత్సహించినవారగుదురు. కొవ్వలిలో దోపిడిజరిగి 50 బస్తాలు తీసుకపోయిరని తెలిపిరి. ఇట్లాంటి దోపిడీలు ఎక్కువ కాగలవనిరి. మాజిల్లానుండి 1 లక్ష టన్నుల ధాన్యం యితర జిల్లాలకు యివ్వగలమనిరి. రాష్ట్రప్రజలు విపులంగా సహాయ నిధికి చందాలివ్వాలనిరి.

వెంకటచల మాజిగారు తమ విశాఖపట్నంజిల్లాలో అనకాపల్లిసబ్ట్రెజరీలో లక్ష యాభయివేల కరెన్సీనోట్లు కొట్టుకపోయినాయనిరి. మంత్రులు రాకపోవడం దురదృష్టం. (సి. నారాయణసామి నాయుడు:— మీ జిల్లాఅంతా రాజులే) ఆవును ప్రధాని కుమారస్వామిరాజాగారు 200 సం॥ల క్రిందట మా జిల్లావారు, ప్రభుత్వంవారు పంచేపల్సు సరిగా బాధితులకు ముట్టేటట్లు చూడాలనిరి. రెవెన్యూ మంత్రిగారు డిశంబరులో వస్తారన్నందుకు సంతోషం. ధాన్యసేకరణ జిల్లాలలో నిలుపుచేయడం మంచిది.

ఎం. భక్తవత్సలంగారు నష్ట వివరముల గూర్చి జరిగిన సహాయ కార్యములగూర్చి అసెంబ్లిలో చదివిన ప్రకటన యీ సభలో గూడా చదివిరి. బుడమేరుస్కీము త్వరగ అమలు జరుపుటకు ప్రయత్నించెదమనిరి.

బొ. నారాయణస్వామినాయుడుగారు మంత్రులు కోటలో పండుకొని తుపాను వచ్చిపోయిందని చెపితే, వార్తలని అతిశయోక్తులనడం న్యాయంకాదనిరి. మూడు వారాలయిన తరువాతైనా అదిఅతిశయోక్తి కాదని వేలకొలది యిండ్లు పోయినవి, వందలకొలదిజనం చనిపోయిరని ప్రభుత్వోద్యోగులు చెప్పినతరువాతైనా ఎటువంటి నష్టం ఎక్కువ జరిగిందో తెలుసుకున్నారా. పంటలనష్టం వచ్చిందంటే ఎంత విలువ ఎన్నిటన్నులు ధాన్యం పోయాయి అన్న వివరాలు ప్రభుత్వంవారు తెలుపలేదు. పొలంలో పంట ఎంతెనీటిలో మునిగింది. ఎంత కొంచమైనా నీటిపైన నిలిచిందని తెలుసుకోవాలి. రోజులతరబడి బుడమేరునీటిలో మునిగిపోయింది. బసంగి పంట పూర్తిగాపోతే సగంపోయిందని కృష్ణాకలెక్టరు తెలియచేసెను. ఆర్థికమంత్రి తుపాను నాడటనుండి వెంటనే తిరిగి వచ్చిరికాని, స్వయంగా చూడలేదని పత్రికలు విమర్శించినవి. ఎన్ని గ్రామాలు చెడినవి, 1950 లోనైనా ఆ గ్రామాలందు తిరిగి సాగుచేయుటకు వీలుందా లేదా అన్నవిషయం ప్రభుత్వంవారు విచారించాలనిరి. బుడమేరు రిజర్వాయరు కట్టకపోవుట పాపమని శ్రీ కళా వెంకట్రావుగారన్నారు. (ఒకరు – ఆతను రెవిన్యూ మంత్రికాదు కనుక యిపుడన్నాడు.) రెవిన్యూబోర్డువారు బుడమేరుని దుఃఖము (విల్లను) అన్నారు. దాన్ని అరికట్టడానికి ప్రభుత్వం చర్యతీసుకోవాలి. దీన్ని నిర్మించడానికి లాంఛామంత్రి ఏ ప్రజాపకరణనష్టాన్ని తేనున్నారు?

ప్రభుత్వంవారు అనాధులైన పేదల గృహనిర్మాణానికి తోడ్పడవలెను. గృహములకు పంట భీమా పంటలకు భీమా చేయించవలెను. బెజవాడ, బందరు, ఏలూరు [illegible] నివారణ చూపించవలెనని కోరిరి.

అత్యుతూరి గోవిందాచారిగారు ప్రజాప్రతినిధులైన మంత్రులు ఈ ఆపదలో ప్రజలకు తమవిధులను సక్రమముగా నిర్వర్తించకపోయినందుకు తమవిచారమును వెలిబుచ్చిరి. పోకలుపడిపోయినవారికి ఎంత

మందికి ఏవిధంగా వెచ్చములిచ్చారు? నల్లభై వేలు ఇచ్చామని మంత్రిగారన్నారు. ఏ రూపంగా? ఆరురోజులు బియ్యం లేకుండా ఎందరోపనివాళ్ళు బాధపడ్డారు. పస్తుపడుకున్నారు.

గాలివానరోజుల్లో బాధపడ్డారంటే అర్థం ఉన్నది. ఇతరప్రాంతాలకు అన్నదానం చేసిన ఈ జిల్లాకు ఇంత అధోగతి ఏల పట్టవలెను. ఈ నాలుగు జిల్లాలకు మంత్రి లేకపోయినందున ఈ జిల్లాలను ఒక కంట కనిపెట్టువారే ప్రభుత్వస్థానమున లేకున్నారా?

అధ్యక్షులు: ఈ మంత్రులు మీవారు కాదా?

స: మావారే – మాపార్టీవారే.

మాధవమీనన్‌గారు:– సీతారామరెడ్డిగారు ఆంధ్రులుకారా? దత్తమండలాలవారుకారా?

స:– కావనలేదు. వారూ మావారే. అయినా ఈ మండలాలనుండి జల ఇంకిపోవువరకు ధాన్యమును లాగివేసినారు. కృష్ణా, ఉదయగోదావరి మండలాలను వెంటనే లోటు జిల్లాలుగ పరిగణించి, మిగిలిన ధాన్యాన్నయినా ఉంచవలెను. ధాన్యసేకరణ ఆపవలెను.

తాటిచెట్లను పాకలనిమిత్తము పేదలకు ఇచ్చుచున్నారు. అని రెవిన్యూమంత్రి అన్నారు. తాటిఆకు అన్నదే లేకుండా పోయినప్పుడు ఎక్కడనుంచితెస్తున్నారు? నర్సాపురం ఆర్. డి. ఒ. గాయప్పగారు ప్రజలను ఆదుకొని ఎంతో సేవచేసినారు. వారికి శాశ్వతిగా మరోచోటికి బదిలీచేసినట్లున్నారు.

అధ్యక్షులు:– మరోచోట వారి సేవ లభింపచేయుటకు కాబోలు.

గోవిందాచారిగారు బుడమేరు కొల్లేరు ఉప్పు టేరులను నిగ్రహించి అనకట్టలు కట్టవలెననిరి. ప్రభువుల పాపములో, ప్రజల పాపములో ఈ విధముగా శాపముగా పరిణమించునని ప్రజలు నమ్ముచున్నారు. పదికోట్లు రూ॥లు ఇచ్చినా ప్రజలకు పరిహారముగాదు. గుడివాడ-బందరు రైలుమార్గం వచ్చాక ఈ ఏరులకు అవరోధమేర్పడి వరదలు వచ్చుచున్నవని రైతులు నమ్ముచున్నారు. వరదనీరు పోవుటకు మార్గములు కల్పించవలెను. ఇప్పుడే రూ 1 కి పదణాల చొ॥న రెమిషను ఇప్పించవలెను.

అధ్యక్షులు:— నివేదికలు రానిదే ఇప్పుడే ఎటుల చెప్పగలరు?

డా॥ జాన్:– ఈప్రభుత్వం మాటలలో వారికి నమ్మకంలేదు.

రెవెన్యూమంత్రి:– రెమిషను ఉదారముగా ఇవ్వవలెనని ప్రభుత్వము తలచుచూ నివేదికలకు ఎదురు చూచుచున్నారు. దెబ్బతిన్న కొబ్బరితోటలకు గూడా రెమిషను ఇచ్చు విషయము ప్రభుత్వమువారు సానుభూతితో ఆలోచించుచున్నారు.

గోవిందాచారిగారు రెవెన్యూమంత్రిగారి వాగ్దానము నమ్ముచున్నామనిరి. పత్రికల వార్తలు అతిశయోక్తులు కావు.

పంట నష్టము తెలుసుకొనుటకు అనధికార విచారణసంఘమును వేయవలెననిరి.

డా॥ లక్ష్మణస్వామి మొదలియారుగారు నిన్నటినుండి కలకత్తా వెళ్లుచుండగా పంటపొలములన్నియు జలార్ణవముగా కనిపించినవనిరి. ఇది జాతికంతకు వచ్చిన ఉపద్రవము. ఏ రాష్ట్రమువారుగాని దీనిని నిర్లక్ష్యము చేయరాదు. ప్రమత్తత గూడదు. అందరూ కలసి సహాయపడవలెను. ప్రాణనష్టమునకు కుటుంబములకు తగిన పరిహారము ఇవ్వవలెను. ప్రాణనష్టము, పశునష్టము, పంటనష్టము నివాసనష్టముఅపారముగా కల్గినది. వెంటనే ప్రజలకు ఆహారసప్లయి గావలెను. మిగులు జిల్లాలు లోటుజిల్లాలైనవి. రవాణాకు అవరోధములైనవి. ఆహారశాఖ, ధాన్య సేకరణశాఖ, రవాణాశాఖ కలసి పనిచేయవలెను. ఈ విషయమున ఈపాటికే కేంద్ర ప్రభుత్వము తన సహాయం చేసి ఉండవలసినది. మనిషికి కావలసినది తలదాచుకొనుటకు కొంప. వల్లుకప్పుకొనుటకు బట్ట. ఇవి వెంటనే ఇప్పించవలెను. పంటలనష్టమును శాస్త్రదృష్టితో విచారించి, రెండోపంటకు ఏర్పాటులు చేయవలెను. ఆర్తులకు ఆపత్తులో వెంటనే సహాయము చేయవలెననిరి.

డా॥ లక్ష్మణస్వామిగారు గత పాతికేండ్లలో ఆరు గాలివానలు వచ్చినవనిరి. అట్టి సంఘటనలు వచ్చినపుడు మనము పాఠములు నేర్చుకొని శాశ్వత నివారణోపాయములు సౌకర్యములు గ్రహించకపోయినచో లాభములేదు. గాలివాన నివారణకు గూడా చర్యగైకొనుటకు విజ్ఞానము అభివృద్ధిగానచ్చును. కాని అంతవరకు గాలివాన వచ్చినపుడు ప్రజలకు చేయవలసిన సౌకర్యముల అన్వేషించవలెను. పంటల భీమా ఏర్పరచవలెను. సహకార పద్ధతిన గృహనిర్మాణము సాగించవలెను.

ప్రభువుల పాపముతే ప్రజలకు వచ్చిన ఈ గాలివానకు కారణమైనచో ఆ ప్రభువులలో గోవిందాచారిగా రొకరని చెప్పెదను. (గోవిందాచారిగారు—అవును) ప్రభుత్వమునే నిందించి ప్రయోజనము లేదు. మనమందరము ప్రభుత్వములోని భారమేననీ, మనమే ప్రభుత్వమనీ తలచి నిర్మాణాత్మకమైన సూచనలు గౌరవ సభ్యులు చేయవలసి ఉన్నదనిరి.

తురగా పురుషోత్తంగారు: తూర్పుగోదావరిజిల్లా తుపాను భీభత్సమునకు తోడు ఉప్పెన కెరటముగూడా కోస్తా ప్రాంతమును సర్వనాశనము చేసెననిరి. పిఠాపురం తాలూకాలో అనంతమైన నష్టం కలుగగా ప్రభుత్వ అంకెలలో ఎంతమాత్రం ఉదహరించకపోవటం అధికారుల అజాగ్రత్తను తెలుపుతోంది. ప్రభుత్వంవారు ఎంత సహాయం చేస్తామని చెప్పినా ఇట్టి అధికారుల ద్వారా నేగదా ప్రజకు సహాయం అందేది? ఒక్కకొబ్బరిచెట్టుకు 1500 నష్టంవచ్చినది. పేదరైతు దిక్కులేక, మొరవినేవారు లేక బాధపడుతున్నాడు. ప్రభుత్వంవారు అతన్ని ఆదుకోవాలి. రెండు రోజులు నీరు నిలిస్తే పంట ఏవిధంగాను మిగలదు. కాఫీహోటళ్లు, సినిమాలు తెరవడానికి మంత్రులు సంచారం చేయుడంగాక, రైతులకు ఈ ఆపత్తులో విత్తనాలు ఎరువులు మున్నగు సహాయం చెయ్యడానికి వెళ్ళి అవిధమైన సన్మానాలు పొందవలెను. వ్యవసాయానికి రైతులకు అన్నివిధాల తోడ్పడకపోతే కాటకం దేశంలో తప్పదు. భూమిలేని వారికి ఋణాలుఇచ్చే ఏర్పాటుచేయువలెననిరి. ఉప్పెన కరటంవచ్చినప్రాంతాన్న రెండోపంటకు నీరుసరఫరా కావలెను. ప్రభుత్వ ఉద్యోగుల మనస్తత్వమును మార్పించవలెను. రెవెన్యూ రిజర్వు నిధినుండి రెండు మూడు కోట్లు వెచ్చించి, దెబ్బతిన్నవారిని ఆదుకోవలెననిరి.

నాయరంగారెడ్డిగారు: కడప మండలము వరదలవల్ల ఎంతో నష్టపోయినదనియు చేసు వల్లడింపబడిన జౌదార్యము క్రియారూపముగా మారవలెననిరి. మామూలు రోజులలో గూడా ప్రాంతీయ వ్యత్యాసములు లేకుండా రోడ్ల మరమ్మతులు, చెర్వుల మరమ్మతులు సాగింపవలెను. చెన్నూరువద్ద వంతెనకు జర్గిన నష్టము కూడదీయరానిది 8 రోడు గండ్లు పడినవి. కడప-కర్నూలు రోడ్డు విపరీతముగా దెబ్బతిన్నది, రస్తాలను ఖర్చులో నిమిత్తం లేకుండా బాగుచేయవలెను. జిల్లాలోని చెర్వులను కాల్వలను తక్షణమే బాగు చేయవలెననిరి.

నాయకంటి శంకరరెడ్డిగారు: కర్నూలు జిల్లాలలో 20 వేల ఇళ్ళు దెబ్బతిన్నవనిరి. ప్రభుత్వము చేయు సహాయము అల్పముగా ఉన్నది. పిసినిగొట్టుగా ఉన్నది. పెన్న, కుందూ, హంద్రీ, తుంగభద్ర నదులుపొంగి ఎందరో ప్రాణధనములు పోగొట్టుకొనగా ప్రభుత్వమువారిచ్చు అయిదు పది రూపాయలు ఏమూలకు? సంగమేశ్వరం, మాడగిల, మున్నగు ప్రాంతముల ప్రజలు తమ సర్వస్వము పోగొట్టుకొనిరి. పుట్టిలలో వారిని భద్ర ప్రదేశమునకు చేరవేయవలసి వచ్చినది. ఎందరో సాలెలు మగ్గాలు పోగొట్టుకొనిరి. వారికి వృత్తి సాధనము కల్పించవలెను. రస్తాలుఏర్పాటు, కాల్వలు బాగుచేయవలెను. ప్రధాని ఈ వార్తలు అతిశయోక్తులని చెప్పిన అభిప్రాయమును పొరబెసి సవరించుకొని ఉండవలెను. సహాయము ఒకప్రణాళిక ప్రకారం జరుగునట్లు చేయవలెననిరి.

డా॥ జాన్‌గారు: వెంటనే తగినధనము మంజూరుచేసి తెచ్చివ్వవలెననిరి.

### రెవిన్యూమంత్రి సమాధానం

రెవిన్యూమంత్రి సీతారామ రెడ్డిగారు సభ్యులు తమకు చేసిన సూచనలకు, చెప్పిన వార్తలకు అభినందనము తెలిపిరి. ఆయా ప్రాంతములనుండి ప్రభుత్వ ప్రకటన అచ్చువేయువరకు వచ్చిన వార్తలు మాత్రము ప్రకటింపబడినవి. అంతేమాత్రమున మిగతా ప్రాంతముల నిర్లక్ష్యము చేసితిమనుకొనరాదు. గాలివాన వచ్చినతోడనే కలెక్టర్లను ఫోనులో పిలచితిమి గాని తంతి సౌకర్యములు చెడిపోయినందున వారితో సంబంధము తీయుటకు మూడు నాల్గు రోజులు పట్టినది. తర్వాత వరుసగా వార్తలు వచ్చినవి. మంత్రులు వెళ్ళలేదని గౌరవ సభ్యులు విమర్శించినారు. చంద్రమౌళి పరమేశ్వరన్‌గార్లు సంచారం చేసినారు. రెవెన్యూ బోర్డు సభ్యులు నల్గురు వెళ్లిన వెంటనే సహాయం జరుపుటకు వీలగునని వారిని పంపితిమి, అంతేగానినిర్లక్ష్యమువల్ల కాదు. మేం మొంతో ఆందోళనపడి వైర్లెస్ ద్వారా వార్తలు తెప్పించితిమి. ప్రజకు జరుగు సహాయం తక్షణమె ప్రయోజనకరమై ఉండవలెనుట ప్రభుత్వ మతము. భవిష్యమున కల్గిన ఆపదయొక్క స్వరూపమును చిత్రించుకొన్న చేసిన సహాయము అల్పముగా కనిపించవచ్చును. అంతటితో ప్రభుత్వం ఆగునని అనుకోరాదు. ఇట్టి పరిస్థితుల గమనించియే ప్రభుత్వం క్షేమనిధి నేర్పరచిరి. అది ఇప్పుడు 88.49 లక్షలు ఉన్నది.

రెమిషన్ల సందర్భమున లక్ష్మణస్వామి గారు చెప్పినది సముచితముగా ఉన్నది. దర్యాప్తు గావించి ప్రభుత్వం రెమిషన్ల చాలా ఉదారముగా ఇవ్వగలరు శాస్త్ర పద్ధతిన రెమిషను ఇవ్వబడును. 500 ఋణము వచ్చినా గూడా చాలదని వెయ్యవరకు పంపవలెనని కొందరు సూచించినారు. స్థానిక కలక్టర్లను, పరిస్థితులను తెలిసియే ఈ నిర్ణయము గావించబడినది. అవసరమైనచో ఈ ఋణము అవసరమైన చోట్ల ప్రభుత్వము హెచ్చింప ఆలోచించారు. హామీ లేకుండా భూమి లేని వారికి ప్రజా ధనమును ఋణము ఇవ్వలేము. చెర్వులన్ని గండ్లుపడ్డ చోటులకు మరమ్మతు చేయవలెనని ఉత్తర్వు గావింపబడెను. లేనిచో ఆహారస్థితి దెబ్బ తినునని ప్రభుత్వమునకు తెలియును. రెండో పంటకు ఉన్న నీటిని గాలి వాన వచ్చినచోట ముందు సప్లయి చేయవలెనని ప్రభుత్వం ఉత్తర్వు చేసిరి. 'జోనల్' పద్ధతి'ని కోస్తా ప్రాంతంలో తొలగించవలెనను పురుషోత్తం గారి సూచన ఎవరికి గాని అభ్యంతరం లేనిచో ప్రభుత్వం ఆలోచించెదరు.

ప్రజలకు ఆహారం సరిగ్గా సప్లయిచేయబడ లేదని కొందరు చెప్పిరి. విశాఖపట్నంలో 5-11-49 తేదీన 6250 టన్నుల నిల్వ ఉన్నది. తూ. గో. లో 6,111 ట నిల్వ ఉన్నది. ప. గోదావరి. 7,194 ట. ఉన్నది. కృష్ణాలో 4,861 టన్నుల బియ్యం నిల్వ ఉన్నది. బియ్యం కొరత ఏర్పాటులు సరిచెయ్యవలెనని అత్యవసర సందేశములు పంపితిమి. రెండు మూడు రోజుల్లో పరిస్థితి సరికాగలదు.

పంట నష్టమునుగూర్చి ప్రభుత్వంవారు సరిగ్గా అంచనాలు వేయించి సరియైన రెమిషన్లు ఇవ్వగలరు. దెబ్బతిన్న ప్రాంతము విశాల భూఖండమునందు ఉన్నందున వార్తలు వచ్చుటకు ఆలస్యమైనది. బుడమేరు ప్రాజెక్టు, రామపాదసాగరమువల్ల ఆగిపోయినది. బుడమేరును తప్పక అరికట్టగలరని మంత్రిగారు హామీ ఇచ్చిరి.

పంట, పశునష్టభీమా ఎంత జరూరు సంస్కరణమైనా వెంటనే అమలుచేయడం రాష్ట్రమున సాధ్యము గాదని మంత్రిగారనిరి. ఋణములుగూడా ప్రభుత్వం ఒక పద్ధతిని ఇచ్చుచున్నారు. ఎకరానికి వంద రూపాయలు అయిదేళ్ళలో చెల్లించునట్లు ఇవ్వగలరు. వరద నిరోధ కార్యములకు, క్షామనివారణ కార్యక్రమములో ఉన్నవి. ధాన్యసేకరణ మిగులునుబట్టే, హింసలేకుండా చేయబడుననిరి. ధాన్యసేకరణ లేనిచో రైతే ఉన్న ధాన్యమును ఎటుల విడుదల చేసుకొనుటా అని బాధపడును. ప్రభుత్వం సర్వశక్తులా, సర్వయుక్తులా సహాయం చేయుగలదు. ఇది నిజంగా మన జాతికి కల్గిన నష్టము. ఈ సంగతి అందరూ గ్రహించినారు. మనకు వచ్చిన ఈ ఉపద్రవములో అందరూ ఆదుకొనవలెను.

అధ్యక్షులు: ఆర్. కె. పటేల్‌వచ్చినారు. వారితో చెప్పలేకపోయినారా?

రెవిన్యూమంత్రి: వారు వచ్చినపని వేరు, వారితో ఈవిషయం చర్చించుటకు మాకు అవకాశం కలుగలేదు. బాధితులకు సహాయం చేయుటకు సర్వప్రజా సహకారము లభించునని నేను ఆశించుచున్నాను. ద్రవ్యముగాదు కావలసినది. సేవ. ద్రవ్యము సద్వినియోగం కావలెను. 25 వ తేదీన షెరీఫ్‌గారు సానుభూతిసభ ఏర్పరచినారు.

అందులో అందరు పాల్గొని సహాయ మార్గాన్వేషణకు తోడ్పడగోరెద ననిరి.

సవరణలు ఉపసంహరించబడెను. 17 వ తేదీకి సభ వాయిదా పడెను.

## అరెస్టయిన కమ్యూనిస్టు ప్రముఖుని పరారీ

### పోలీసులకు గ్రామస్థుల ఆటంకం

తణుకు, నవంబరు 14: పశ్చిమ గోదావరిజిల్లా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి ఉద్దరాజు రామరాజుగారిని, భీమవరంతాలూకా కోరుకొల్లుగ్రామంలో 9 తేదీ సాయంకాలం, భీమవరం పోలీసువారు అరెస్టు చేసి తీసుకొనివెడుతూండగా, గ్రామస్థులు కొందరు అడ్డగించి, పోలీసువారిని గాయపర్చి ఖైదీని అరెస్టునుండి తప్పించినట్లున్నూ, ఖైదీ పరారైనట్లున్నూ, తెలిసినది. ఇన్‌స్పెక్టరుగారి రివాల్వరుకూడా పోయినదట. రిజర్వు పార్టీ గ్రామంలో మకాం చేసి శాంతి భద్రతలను కాపాడుచున్నట్లున్నూ, గ్రామంలో మగపురుషుడు లేకుండా పారిపోయినట్లున్నూ తెలియుచున్నది.


మద్రాసు రేసులు 1949-50

మొదటి రోజు 20-11-1949 ఆదివారము

ప్రతి దినము ప్రవేశపు రేట్లు (పన్నుతో)

| 1 వ ఎంక్లోజరు | | | 2 వ ఎంక్లోజరు |
|---|---|---|---|
| గవర్నర్స్ కప్ దినము తప్ప మిగతా అన్ని రోజులు | పురుషుడు | రు 5/- | అన్ని రోజులలో అందరికి ఒక్కొకరికి రు 2-8-0 |
| | స్త్రీ | రు 3/- | |
| గవర్నర్స్ కప్ దినము | పురుషుడు | రు 6/- | |
| | స్త్రీ | రు 4/- | |
| సీజన్ టిక్కెట్లు (పబ్లిక్) | పురుషుడు | రు 90/- | |
| | స్త్రీ | రు 45/- | |

8 యేండ్లలోపు బిడ్డలు ఏ ఎంక్లోజరులోనికిని రానీయబడరు.

ఎం. నబీ ఖాన్,
సెక్రటరి, మద్రాసు రేస్‌క్లబ్.



లక్షలకొలది ప్రజల అభిమాన పాత్రమైన

జ్యోతి

హరికేన్ లాంతరు

తయారుచేసినది. జే యింజనీరింగ్ వర్క్సు లిమిటెడ్, కలకత్తా.

ఏజెంట్లు (1) మెసర్సు పొప్పట్ జమాల్ అండ్ సన్సు, బ్రాడ్వే, మదరాసు.

(2) మెసర్సు సాధూరాల్జీ, గన్ ఫౌండ్రీ రోడ్డు, హైదరాబాద్ (దక్కన్)



Here comes the FOWLER MARSHALL

A fine 38/40 B.H.P. Diesel Crawler Tractor for agricultural purposes using inexpensive diesel fuel. The tractor for continuous service and real hard work.

MARSHALL, SONS & CO. (INDIA) LTD.
CALCUTTA • BOMBAY • MADRAS • NEW DELHI • BANGALORE



నిజంగా ఒక ప్రశాంతమైన సిగరెట్టు

పాసింగ్ షో

PASSING SHOW

PASSING SHOW
10 PASSING SHOW
CORK TIPPED VIRGINIA

4 అణాలకు 10 స్థానిక పన్నుల సరఫరాలకు మాత్రమే.

PSC/129

## ఇండో చైనా:

# బావ్ దాయ్ ప్రభుత్వంపై వీట్ మిన్ స్వతంత్రవాదుల తిరుగుబాటు

మాన్కే, (చైనా-వీట్‌మిన్ సరిహద్దు) నవంబర్ 15: ఇండోచైనా వీట్‌మిన్ స్వతంత్రవాదులు నిన్నటిదినం ట్రాకో గ్రామంమీద దండయాత్రచేశారు. మాన్‌కేకు మైలుదూరంలోవున్న యీగ్రామం మేయరుబావ్ దాయ్ ప్రభుత్వంపట్ల తన భక్తివిశ్వాసాలు ప్రకటించారు.

ఈ విప్లవకారులు ఆ గ్రామాన్ని కాపలా కాస్తున్న ఫ్రెంచిసైన్యాలమీద దాడిచేశారు. ఈవిప్లవకారులనాయకుడూ ఇంకాచాలామంది విప్లవకారులూ ఆ దండయాత్రలో చనిపోయారు. తక్కినవారు ఆయుధాలతో సహా చైనాదీవిలోకి పారిపోయారు. ఫ్రెంచివారుకూడా కొంతమంది చనిపోయారు. ఎంతమంది చనిపోయిందీ ప్రకటించలేదు.

పరిహద్దుపరిస్థితి ఫ్రెంచివారికిచాలా ఆందోళనజనకంగా ఉన్నది. ఇక్కడి ప్రజలు చాలామంది చైనాజాతికి చెందిన వారు. వీరు చైనాకమ్యూనిస్టు ప్రభుత్వం మద్దతుతో ఫ్రెంచిరక్షణ స్థావరాలమీద దండయాత్రలు కేంద్రీకరించేలా కనుపించు తున్నది. ఈ విప్లవకారులలో చైనావారు ఉండటం స్థానికప్రజలనుకూడా రెచ్చగొట్టుతుందనుకుంటున్నారు.

మాన్‌కేలో, సర్వ సన్నాహాలతో వున్న ఫ్రెంచి సేనలను ఇను మిక్కిలిగా దించారు. ఫ్రెంచివారు, జర్మనీపక్షాన పోరాడిన విదేశ సైనికులను చేర్చి తయారుచేసిన ప్రత్యేకదళం మాంకేదుర్గాన్ని కాపలా కాస్తున్నది. చైనా వీట్‌నామ్ సరిహద్దున వున్న నదీవంతెన దాటగానే చైనా జాతీయ ప్రభుత్వానికి సంబంధించిన టాంగ్ హింగ్ అనే దుర్గంవుంది. దీన్లో అమెరికన్ ఆయుధాలతో సన్నద్ధమైవున్న 1500 జాతీయసైన్యం వుంది. వీరు కమ్యూనిస్టు గెరిల్లాలను ప్రతిఘటించుతూ ఇక్కడ ఉన్నారు. కమ్యూనిస్టు సేనలు క్వాంటంగ్ రాష్ట్రంలో ఈ చివరనుంచి ఆ చివరకు పరవళ్ళు పెడుతున్న తరుణంలో వీరిక్కడ సవోయెట్ సేనాపర్వంతి ఉత్సవాలు చేశారు.

కమ్యూనిస్టుసైన్యాలు సరిహద్దునైపుకు పురోగమించుతున్నట్టూ టాంగ్‌కింగ్ అఖాతంలోవున్న క్వాన్‌చేవాన్ ద్వీపకల్పంలో తీవ్రమైనపోరాటంసాగుతున్నట్టూ జాతీయప్రభుత్వ ప్రతిఘటన క్రమేపీ బలహీన మైపోతున్నట్టూ వార్తలువస్తున్నవి.

## డిటిన్యూల అర్జీలు హైకోర్టు నిరాకరణ

మదరాసు, నవంబరు 16: 14 గురు డిటిన్యూలను వారి నిర్బంధ ఉత్తరువులు సక్రమంగా లేవని చెప్పి విడుదల చేయ గోరుచు, అడ్వకేటు ఎస్. ఎస్. మణిగారు హైకోర్టులో దాఖలుచేసిన అర్జీలను జస్టిస్ వి. గోవిందమీనను, బషీరు అహమ్మదుగార్లు నిరాకరించిరి. ప్రజారక్షణ ఆర్డినెన్సులో 4 ఎ. క్లాజు, "నిర్బంధపు ఆర్డరులో ఎటువంటి లోపమున్న నిర్బంధం సక్రమమే" అని నిర్ణయించుచున్నప్పుడు నిర్బంధించే అధికారులకు సర్వాధికారం యిస్తున్నదయినను, అది అవసరమా లేదా అను విషయం తాము చర్చింపబోమనియు, అది సక్రమమయిన క్లాజే కనుక, దానిప్రకారం జరిగిన నిర్బంధము సక్రమమే, యని న్యాయమూర్తులు తీర్పు చెప్పిరి.

పాకిస్థాను నుండి వచ్చిన కాందిసీకులకు 75 దుకాణములు (బంకులు) కట్టుకొనుటకు చెరి రూ 300 అప్పుయిచ్చుటకు మదరాసు ప్రభుత్వంవారు అంగీకరించిరి. ఎస్ప్లనేడు బస్సుస్టాండు ప్రక్కన దుకాణాలు కట్టి వారికి అద్దెకు యిచ్చుటకు రూ 10,000 ఖర్చు మంజూరు చేసిరి.

## విశాఖపట్నం నీటిసప్లయి

విశాఖపట్నం మున్సిపాలిటీ నీటిసప్లయి అభివృద్ధికిగాను మదరాసు ప్రభుత్వంవారు రూ 3,38,000 సగం గ్రాంటుగను సగం ఋణంగాను యిచ్చుటకు నిశ్చయించిరి. ఈ నగరానికి నీటిసరఫరా యెక్కువ చేయుటకై గోస్తని మిలిటరీ వాటరువర్క్సు ఇండియా ప్రభుత్వం నుండి కొనియుండిరి. కాని మరికొన్ని పైపులు పంపులు పెడితే గాని యిది పూర్తిగ నగరానికి వినియోగపడదు. కావున పైఖర్చు మంజూరు చేయబడినది.

## దేశీయ వైద్యం ఔషధాల సహకార సంఘం

మదరాసు అడయారులో చెన్నరాష్ట్ర దేశీయ వైద్యుల సహకార ఫార్మసీ వార్షికోత్సవము 15 నా॥ లను ప్రధాన మంత్రి కుమారస్వామి రాజాగారి అధ్యక్షతను జరిగెను. ప్రధాని గారు దేశీయ వైద్యం యొక్క ఉపయోగమును ఉగ్గడించుచు, యిందు స్థానిక సంస్థలన్నియు సభ్యులుగ చేర్చుకొన బడుట చాల సబబుగ నున్నదనియు, ఒకే రకం మంచి మందులు తయారగుటకు యిట్టి సంస్థ ఉండాలనియు నుడివిరి.

### కాంగ్రెసులో ముస్లింల సభ్యత్వ సమస్య

చెన్నరాష్ట్ర ముస్లిము కన్వెంషను యీ నెల 27 వ తేదీన మదరాసులో జరుగును. అబ్దుల హమీదుఖానుగారు కన్వీనరు. డా॥ సయ్యదు అబ్దుల్ లతీఫ్ గారు (హైదరాబాదు) సభలో పాల్గొందురు. ముస్లిములు కాంగ్రెసులో చేరుట గూర్చి నిర్ణయం జరుగును.

### ఫిర్కాల అభివృద్ధి: గ్రామసేవకులు

ఫిర్కాల అభివృద్ధిస్కీములో రివెన్యూ ఇన్‌స్పెక్టరు హోదాతో 125 గ్రామసేవకులను నియమించుటకు రూ 1,48,500 సాలీనా ఖర్చు, రూ 61,875 ప్రారంభ ఖర్చు మదరాసు ప్రభుత్వంవారు మంజూరు చేసిరి.

### సాధుకుల తెలుగుచెట్టి సంఘం

మదరాసులోని సాధుకుల తెలుగుచెట్టి మహాజన సంఘం, యువజన సంఘంవారు సి. జానకయ్య చెట్టిగారి అధ్యక్షతన వ్యాపారస్థుల సంఘ భవనమున సభచేసి మహా మధురై యందు జరుగు ఆ మహాసంఘ వార్షిక సభకు ప్రతినిధులను పంపుటకు తీర్మానించిరి. సంఘోద్ధరణకు 15 గురు సభ్యులుగల ఉప సంఘం ఎన్నుకొనబడెను. దానికి సి. జానకయ్య చెట్టిగారు అధ్యక్షులు, సి. పెరుమాళ చెట్టిగారు కోశాధికారి, టి. వి. ఎతిరాజులు చెట్టి, ఎం. వి. కోదండరామ చెట్టి, సి. దేవరాజులు చెట్టి, మున్నగు వారు సభ్యులుగ నున్నారు.

కృష్ణారావు (20) అను విద్యార్థి మద్రాసు అల్లరి మానవ సమ్మేళనం సందర్భములో విమానాశ్రయ జుబ్బిలి ఆస్పత్రిలో చేర్చబడెను.

### మద్యపాన నిషేధంపేరిట శిక్షలు

[illegible]

## సమితిలో రష్యా 'శాంతి' ప్రతిపాదన

### పాకిస్థాన్ యుగోస్లావియాల విమర్శ

లేక్‌సక్సెస్, నవంబరు 15: ఐక్యరాజ్య సమితి రాజకీయ సంఘంలో రష్యా ప్రతిపాదించిన శాంతి పథకాన్ని యుగోస్లావియా, పాకిస్థాన్‌లు తీవ్రంగా విమర్శించాయి.

యుగోస్లావియా ప్రతినిధి ప్రపంచ శాంతి రక్షణలో అగ్రరాజ్య బాధ్యతలను స్మరిస్తూ, చిన్న రాజ్యాలమీదకు అవి పంటి కాలుమోపి లేస్తూవుండడాన్ని అనాకరించారు. రష్యా పూర్తిగా ఇప్పుడు యుద్ధోన్మాదాన్ని ప్రదర్శిస్తున్నది అందుకు అతి కుటిలమైన రాజనీతి అనుసరిస్తున్నది. ఈవిధంగా చిన్న రాజ్యాలమీద పెద్ద రాష్ట్రాలు స్వర్గం ఎన్నుకొంటే, పెద్దపెద్ద సంఘర్షణలకు దారులు పడుతూ వుంటాయి అని ఆయన అన్నారు.

సోవియట్ రష్యా తనతీర్మానం పూర్వభాగంలో బ్రిటన్ అమెరికాలను యుద్ధోన్మాదుల క్రింద చిత్రించింది. ఇది సర్ జఫ్రుల్లాకుచాలాజుగుప్సాకరంగాతోచింది. నేను బ్రిటన్‌లో చదువుకున్నాను. వారి మనస్సులు నాకు బాగా తెలుసు. కాని వైషిన్‌స్కీ తీర్మానం చేస్తున్న ఆరోపణ పూర్తిగా నిరాధారంగాను, జుగుప్సాకరంగాను కన్పిస్తున్నది అని సర్ జఫ్రుల్లా అన్నారు.

సర్ జఫ్రుల్లా ఆంగ్లో అమెరికన్ తీర్మానాన్ని బలపరిచారు. మారు ఈ తీర్మానంలోని మొదటి నాలుగు సూత్రాలు బాగా నచ్చాయి. అసలు విఎయంటేమిటో దాన్ని వీరు బాగా గ్రహించారు. ఐక్య రాజ్య సమితి ప్రణాళికలో నమ్మకంవున్న, ఏది అంతా అంటూనే వున్నారు. నాటం ప్రాతిపదికగా తీసుకొని తయారుచేసిన తీర్మానాలను అంగీకరిస్తానే వున్నారు. కాని తీరా ఆ ఒప్పందాలను అమలు జరిపేదగ్గర వచ్చేసరికి మాట, విపరీతాలు తీస్తున్నారు. అందువల్ల అన్ని రాజ్యాలవారూ ఆ సదా ఆ ప్రకారం నడుచుకుంటే శాంతిలో [illegible] ఉపద్రవం లేకుండా పోతుంది అని ఆయన చెప్పారు.

వెస్టుమినిస్టర్ (లండన్) భవనంలో విద్యార్థులైన యువతీజనం ఈమధ్యన్యాసమావేశమైనప్పుడు, ఎలిజబెత్ రాకుమారి కూడా హాజరైనది. ఆఫ్రికానుంచివచ్చిన ఒక మహిళతో ఆమె సంప్రదిస్తున్న దృశ్యం.

# వెలువోలు కమ్యూనిస్టుల దాడికేసు

## 29 మంది ముద్దాయీల విడుదల

బందరు, నవంబరు 15: దివితాలూకా వెలువోలు గ్రామముపై కమ్యూనిస్టుల దాడికేసు సందర్భమున 94 గురు ముద్దాయీలకు 79 మంది మాత్రమే దొరికిరనియు వీరిపై ప్రిలిమినరీ విచారణకు బందరు స్పెషల్ సెకండుక్లాసు మేజస్ట్రేటు జి. వి. దలపతిరావుగారు జర్పిరనియు, ప్రాసిక్యూషన్ తరఫున 183 మంది సాక్షులను విచారించిరనియు, పాఠకుల కెరుక పడియే యున్నది. ప్రాసిక్యూషన్ సాక్షుల విచారణ పూర్తికాగానే, ముద్దాయిలపై చెప్పబడిన సాక్ష్యమునుఁరించి ప్రతిఒక్క ముద్దాయిని పరీక్షించగా అందరు నేరము చేయలేదని చెప్పిరి. దానిపై మేజస్ట్రేటుగారు ప్రాసిక్యూషన్ సాక్ష్యము ముద్దాయీలపై, నేరము చేశారని రుజువు చేయగలదిగా లేదన్నదనియు, కొంతమంది ముద్దాయీలవిషయం సాక్షులలో ఏ ఒక్కరు ఏమీ చెప్పలేదనియు కొంతమందిసాక్ష్యము నమ్మి ముద్దాయీలను సెషన్సుకోర్టుకు పంపుటకు వీలులేకున్నదనియు అంటూ 29 మంది ముద్దాయిలపై సాక్ష్యము వేరువేరుగా విమర్శించి వారిపై నేరము మోపుటకు ఎట్టి ఆధారములులేవని వారినందరిని విడుదలచేసిరి. వదలివేయబడిన ముద్దాయీలు, 10, 20, 22, 26, 40, 41, 42, 58, 61 నుండి 72, 78, 79, 84, 86 నుండి 89, 90 91, వీరిలో కానేరు లక్ష్మయ్య, నాగళ్ల మధుసూదనరావు, జాస్తి చంద్రమౌళి, జాస్తి మల్లికార్జునరావు, గొమ్మడి వెంకటేశ్వరరావు, చండ్ర వెంకటేశ్వరరావులపై ఈ కేసుకు పూర్వమే డిటెన్షన్ వారంట్లు జారీచేయబడి యుండుటచే ఈ 6 గురును రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపబడిరి. మిగిలిన ముద్దాయీల విషయంపై యీ వారాంతంలో ఉత్తరువు జారీచేయబడు నని తెలుస్తున్నది. (స్వ. వి.)

# కొచ్చిన్ తిరువాన్కూర్లలో కొత్త ప్రాజెక్టు

## ఆహార స్వయం సమృద్ధి కృషి

ఎర్నాకులం, నవంబర్ 15: కొచ్చిన్-తిరువాన్కూర్ యూనియన్‌ను ఆహార విషయంలో స్వయం సమృద్ధంచేసే ప్రయత్నంలో ఆ యూనియన్ ప్రభుత్వం ఒక కొత్త ప్రాజెక్టును నిర్మిస్తున్నది.

ఈ ప్రాజెక్టు నిర్మాణానికి పైయూనియన్ రాజప్రముఖ్ శ్రీ తిరువాన్కూరు మహారాజా శంకుస్థాపనోత్సవం జరిపారు.

దీన్ని మాలినీ నదిమీద కడతారు. ఇందుకు 150 లక్షల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా వేస్తున్నారు. 1951 నాటికి ఇది పూర్తి కావచ్చునని గూడా అనుకుంటున్నారు.

ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయితే దాదాపు 47 వేల ఎకరాల కొత్తభూమి సాగులోకి వస్తుంది. అంతేకాకుండా త్రివేండ్రం నగరానికి నీటికరువు తీరిపోతుంది.

## విశ్వేశ్వరయ్యగారికి విందు

హైదరాబాద్, నవంబర్ 15 సర్. ఎం. విశ్వేశ్వరయ్యగారి గౌరవార్థం ప్రముఖపారిశ్రామికవేత్త ఎం. ఎ. లక్ష్మీనరసుగారు నేటి సాయంకాలం మాసాబ్ పల్లిలోని వారి స్వంతభవనంలో విందుచేశారు. నిజాం ఆర్థిక పారిశ్రామిక సమావేశ సభ్యులు, హైదరాబాద్ సంఘ సమావేశ ప్రతినిధులు, నగర ప్రముఖులు, అనేకులు, ఆ సభకు ఆహ్వానితులు అనేకమంది హాజరైయున్నారు.

# రాష్ట్రకాంగ్రెసువారి సముచిత నిర్ణయము

## ఉయ్యూరు కుమారరాజా హర్షము

నూజివీడు, నవంబరు 12: "ఆంధ్రుల చిరకాలవాంఛాఫల సంసిద్ధికి శుభముహూర్తము వచ్చినందుకు చాలాసంతోషం. అందుకు సముచితమైన నిర్ణయము చేసినందుకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యులకు, నాయకులకు, హృదయపూర్వకముగా అభినందిస్తున్నాను. మద్రాసు నగరము విషయములో ఆంధ్ర మహాసభ చేసిన నిర్ణయములు సర్వజనాదరణీయములైనందుకు కూడా చాలా సంతోషమగుచున్నది. అయితే ఒక్కసంగతిమాత్రము చెప్పకతప్పదు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము ఇటీవల ప్రదర్శించిన దీక్ష, శ్రద్ధ మనకు అనేకవిధముల ప్రయోజనకారులైనవి. ముఖ్యముగా అఖిలభారత కాంగ్రెసధ్యక్షులు అగ్రనాయకత్రయ సభ్యులునగు డాక్టరు పట్టాభి సీతారామయ్య పంతులు గారు మద్రాసు నగరముగూర్చి సరియైన వ్యాఖ్యానమును సకాలములో చెప్పి ఆంధ్రులలో రాష్ట్ర విషయమునగల భిన్న భిన్న భావములకు ఏకీభావము సమకూర్చిరి. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు, రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు ఆచార్య రంగా మహర్షి సాంబమూర్తి, సర్ కొండి రామమూర్తి, కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకటరావు, అయ్యదేవర కాళేశ్వరరావు ప్రభృతులు తమ అసమాన ప్రజ్ఞచేతను, అపూర్వమైన ఐకమత్యము తోడను రాష్ట్ర కాంగ్రెసుచే ఏకగ్రీవ నిర్ణయము చేయించిరి. ఇందుకు వీరందరును అభినందనీయులు.

# రాయలసీమలోని కర్నాటక ప్రాంతం

## కర్నాటక కాంగ్రెస్ కార్యదర్శి ప్రకటన

హుబ్లీ, నవంబరు 15: బళ్లారిజిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గ తాలూకాలను, అనంతపురం, కర్నూలు, చిత్తూరు జిల్లాలోని కన్నడ ప్రాంతములను ఆంధ్రరాష్ట్రంలో చేర్చరాదని తీవ్ర ఉద్ఘాటన చేస్తూ కర్నాటక రాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి వి. టి. మగాది ఒక ప్రకటనచేశారు.

ఆయన ఇంకాఈరీతిగా అంటున్నారు: "ఆంధ్రరాష్ట్రము సర్వాంగీకృతమైన నిర్దిష్టభాగములతో, రాష్ట్రంలోని ఇతర భాషాప్రజల ఆమోదంతో, మద్రాసు రాష్ట్ర భాగములతో మాత్రమే ఏర్పడాలని జె. వి. పి. నివేదిక షరతుపెట్టింది. ఈ షరతును ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం ఉల్లంఘిస్తున్నది.

బళ్లారిజిల్లాలోని మూడు తాలూకాలు కేల్కారు తీర్పు ప్రకారం ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు క్రిందకు చేర్చబడినప్పటికీ, ఈ తీర్పు శాశ్వతనిర్ణయమని ఎవ్వరూ పరిగణించలేదు. కన్నడిగులు బళ్లారిలోని ఏ భాగంమీద ఆంధ్రులకు హక్కు లేదని మొదటినుంచి వాదిస్తూనే వచ్చారు. అనంతపురం జిల్లాలోని మడకశిర, హిందూపురం, కల్యాణదుర్గ తాలూకాలు, గూటి, అనంతపురం, ధర్మవరం, పెనుకొండ తాలూకాల్లోని తూర్పు భాగాలు, కర్నూలు జిల్లాలోని పత్తికొండ తాలూకా తూర్పు భాగం, చిత్తూరు జిల్లాలోని కుప్పంతాలూకా తూర్పుభాగం తమ నేవనిచూసి కన్నడిగులు వాదిస్తూవచ్చారు.

ఈ భాగాలపై కర్నాటక, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘాలు ఇదివరలో జరిపిన సంప్రదింపులన్నీ భగ్నమైనాయి. దీనిని ఆంధ్రకాంగ్రెసు గుర్తించకపోవటం విచారకరం. పైగా జె.వి.పి. రిపోర్టులోని షరతు ప్రకారం, సరిహద్దు తగాదాలన్నీ పరిష్కారమైనాయని ఆంధ్ర కాంగ్రెసు ప్రకటించి, అపోహలను ప్రచారంచేయ్యాలని చూస్తున్నది. ఈ అపోహలను పరిగణించి, కేంద్రప్రభుత్వం, కాంగ్రెసు హైకమాండు, కర్నాటకుల హక్కులను భంగకరంగా ఎట్టి నిర్ణయము చెయదని నేను విశ్వసిస్తున్నాను."

# రాష్ట్ర రైతు కాంగ్రెస్ తీర్మానాలు

విజయవాడ, నవంబరు 14:— ఆంధ్ర రాష్ట్ర రైతు కాంగ్రెస్ సర్వసభ్య సమావేశం గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారి అధ్యక్షతను ఆంధ్రరత్న భవనంలో మొన్న జరిగినప్పుడు యీ క్రింది తీర్మానాలు చేశారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సర్వసభ్య సమావేశంలో ఆమోదించిన ఆంధ్రరాష్ట్రం తుపాను బాధిత్యముల తీర్మానములను యీ సమావేశంవారు ఆమోదిస్తూ యీ విషయాలలో వెంటనే తగుచర్య తీసుకోవలసినదిగ కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వములను, కాంగ్రెసు వర్కింగు కమిటీని కోరుచున్నారు.

ఎస్టేట్లకు సంబంధించినఅన్ని వ్యవహారములు కోర్టులలో విచారణ జరగకుండ వెంటనే ఆపుచేస్తూ చట్టము చేయవలసిందని ప్రభుత్వాన్ని కోరారు. 1936 సం.ఇనాం చట్టమునకు సంబంధించిన ఈనాములను కూడ రద్దుచేయుటకు తగు చట్టము చేయవలెనని కోరారు. రాష్ట్రంలోగల ఎస్టేట్లనన్నిటినీ వెంటనే స్వాధీనం చేసుకోవలసినదని కోరారు.

జమీందారీ రద్దుచట్టము ప్రకారం జమీందార్లకు యివ్వనున్న పరిహారము చట్టము ప్రకారం యివ్వవలసిన మొత్తము కంటె హెచ్చు మొత్తమును అనగా 18½ కోట్ల సొమ్మును యివ్వటానికి ప్రభుత్వం బిల్లు ప్రవేశపెట్టినందుకు గర్హిస్తూ, వెంటనే ఆ బిల్లును ఉపసంహరించుకోవాలని కోరారు. మద్రాసు ప్రభుత్వంవారు ప్రకటించిన వ్యవసాయాభివృద్ధి బిల్లు రైతుల శ్రేయస్సుకుగాని, పంట అభివృద్ధికిగాని దోహదమివ్వజాలదని అభిప్రాయపడుతూ ఆ బిల్లును ప్రవేశపెట్టరాదని కోరారు. మద్రాసు చెరువుల అభివృద్ధి చట్టమును వెంటనే అమలు జరిపి తుపానువరదల వలన దెబ్బతిన్న అన్ని జిల్లాలలోని చెరువులను వెంటనే మరమ్మతుచేయించాలని కోరారు. జమీందారీరద్దు చట్టం ప్రకారం ప్రభుత్వం స్వాధీనంచేసుకున్న ఎస్టేట్లలో పరిస్థితులు ఏవిధముగానున్నవో విచారించి ఒకనివేదిక తయారుచేయుటకు ఆయా జిల్లా రైతుకాంగ్రెస్ సంఘాలను కోరటమైనది. ఏజన్సీ ప్రాంతాలలో రైతులకు రక్షణ యివ్వవలసిందని కోరారు. ఏజన్సీ ప్రాంతాలలోవున్న కొండవాగులకు, సెలయేళ్లకుఅక్కడక్కడ చిన్నచిన్న కట్టలు ఏర్పాటుచేస్తే, కొన్ని వేల యకరాలు సాగు అగుటయేగాక, ఆప్రాంతం స్వయం సమృద్ధికాగలదని అభిప్రాయపడుతూ వెంటనే ప్రభుత్వం యిట్టి ఏర్పాట్లు చెయ్యవలసినదని కోరారు. తుపానువల్ల నష్టపడిన చెరకు ఉత్పత్తిదారులకు పెనుగులు చాలినన్ని సప్లయిచేసి సహాయపడవలసినదిగ కోరారు. ధాన్యంధరల నిర్ణయ సంఘంలో రైతు కాంగ్రెస్‌కు ప్రాతినిధ్య మివ్వవలసినదిగ కోరారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారి మృతికి సంతాపం వెలిబుచ్చుతూ ఒకతీర్మానం చేశారు.

## యు. పి. కాంగ్రెస్‌వాదుల సభలో నెహ్రూ ప్రసంగం

లక్నో, నవంబరు 14: నవంబర్ 26, 27 తేదీలలో ఫయిజాబాద్‌లో జరగబోతున్న సంయుక్తరాష్ట్రాల రాజకీయ మహాసభలో ప్రధాని నెహ్రూ ప్రసంగిస్తారు.

# 'తుపానుబాధిత ప్రాంతాలనుండి ధాన్యంఎగుమతులు నిలిపెయ్యాలి'

## ఏలూరు పౌరుల విజ్ఞప్తి

ఏలూరు, నవంబరు 14: ఇటీవల తుపానువల్ల నష్టపడిన ప్రాంతాలలో విపరీతంగా పెరిగిన ఆహార పదార్థాల ధరలను వెంటనే అదుపులోకి తేవలెననీ యీ ప్రాంతాలనుండి ధాన్యం బియ్యం ఎగుమతులను వెంటనే నిలిపి వెయ్యాలనీ ప్రభుత్వాన్ని కోరుతూ నిన్న సాయంకాలం ఏలూరు జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధ్వర్యమున చెరుకువాడ వెంకటనరసింహం పంతులుగారి అధ్యక్షతను జరిగిన బహిరంగ సభలో తీర్మానించారు. తుపాను బాధిత ప్రాంతానికంతా రెండవ పంట పండించటానికి సాగు సౌకర్యాలుకలుగ జెయ్యవలసిందనీ, నష్టపడిన పేద ప్రజలకు వెంటనే తగురీతిని సహాయం చెయ్యవలెననీ కూడ కోరారు.

భూస్వాములున్నూ, వారివద్ద కౌలుకు తీసికొని సాగుచేసిన కౌలుదార్లున్నూ పండినపంట చెరిసగముగా తీసికొనునట్లున్నూ కౌలుదార్ల బాకీలను వసూలుచేస్తూ యున్నా ప్రభుత్వం శాసనంచేయవలసిన దనిన్నీ, తుపానువలన నష్టపడిన కార్మికులకు యజమానులచేత 1 నెల జీతం యిప్పించవలసిన దనిన్నీ కోరారు.

తుపానువలన నష్టపోయిన జిల్లాలలో ప్రజాధనాపహరణ కారణభూతములైన సినిమాలు, కాఫీ, టీ విక్రయములు, బీడీ సిగరెట్లు విక్రయమును, వరకులు వెండి బంగారు వస్తువుల వ్యాపారము జరుగుటయూ 6 మాసము వరకూ నిషేధించాలనీ, వెండి బంగారముల నమ్మగోరే ప్రజల వద్దనుండి ప్రభుత్వమే వానిని ఖరీదు చేయాలనీ కోరారు.

ఈ కష్టకాలములో భూరుబరి రైతుల ధాన్యాన్ని అనగా 100 బస్తాలపై చిలుకు వున్నవారి ధాన్యాన్ని ప్రభుత్వం వశం చేసికొని వారి కుటుంబానికి తలకి 5 బస్తాల ధాన్యం భోజనమునకు యిచ్చి మిగతా ధాన్యాన్ని ప్రభుత్వంవారే బస్తా రూ॥ 10 ధరకు అమ్మవలెననీ కూడ కోరారు.

ధాన్యసేకరణకు సంబంధించిన ఉద్యోగులను తరచు మార్చడంవల్ల ప్రజల కిబ్బంది కలుగుచున్నది గాన అట్లు చేయవలదనీ, బియ్యపు టోకు అమ్మకందార్ల వల్ల ధర పెరగడం తప్ప యితర ప్రయోజనమేమీ లేనందున వారిని రద్దు చేయించవలసిందనీ కోరారు.

ప్రజాసంస్థలలోని కార్యకర్తలూ, శాసనసభ్యులు, ప్రజాసేవకులైన వారంతా ఈ క్లిష్టపరిస్థితిలో అధికంగాసేవజేసి, కాంగ్రెసు గౌరవమును కాపాడవలసిందిగా కోరుచు తీర్మానించారు.

# రాష్ట్ర ప్రజా శాంతి రక్షణ చట్టం

## అసెంబ్లీ ప్రశ్నోత్తరాలు

మదరాసు, నవంబరు 16: పశ్చిమబెంగాల్ సెక్యూరిటీయాక్టు, బీహారు ప్రజారక్షణచట్టము ఆయా హైకోర్టులు ఇచ్చిన తీర్పుల ననుసరించి రాష్ట్రప్రభుత్వము వుత్తర్వుద్వారా చట్టజీతము పాటిగించుట శాస్త్రీయము అవునా కాదా యను సందేహము 1949 జూలైనుండి ఏర్పడెను. ఆగస్టు 2 వ తేదీన ఆర్డినెన్సు జారీచేయుటకు గవర్నరుజనరలు అంగీకారము బడయవలసినదని ఇండియా ప్రభుత్వమును కోరితిమనియు, గవర్నరుజనరలు సమ్మతి ఆగస్టు 11 న వచ్చినదనియు, ఆనాడే ఆర్డినెన్సు జారీ అయినదనీ న్యాయమంత్రి శ్రీ మాధవ మీనన్ నేడు అసెంబ్లీలో జనాబ్ మహమ్మద్ ఇబ్రహీం ప్రశ్నకు జవాబు ఇచ్చిరి.

## పెట్రోలు పంపకవర్గీకరణ

పెట్రోలు పంపకసందర్భమున అన్ని కేట్లుకూడా 'అవసరసర్వీసు' గనే పరిగణించబడుచున్నారనియు, ఇది కొంతకాలమునుంచి లిఖితమైవుంచిన పాతిసంప్రదాయ పునరుద్ధరణయేయని అర్థికమంత్రి నేడు అసెంబ్లీలో ఒకసభ్యునికి సమాధానమిచ్చుచూ చెప్పిరి.

ప్ర: స్త్రీవర్గమునకూడ వర్తించునా?

స: కాగ్దీరోజుల్లో స్త్రీవర్గంతా అన్ని కేట్లు అయ్యేవరకు. అయినా ప్రత్యేకమైన కోరికవచ్చినప్పుడు పరిశీలించగలము.

## ప్రదర్శనలు చేసిన ముస్లింలీగర్లు

లండన్, నవంబరు 14: నెహ్రూ వచ్చిన సందర్భంలో ఇండియా హౌస్ ముందు అల్లరిచేసిన ముస్లిం ముద్దాయీలిద్దర్ని యీ వేళ విచారణకు పెట్టారు. వీరిద్దరు పూచీకత్తులమీద తాత్కాలికంగా విడుదలచేశారు.

శాంతికి భంగం కలిగే పద్ధతిని వసి వీధిలో అల్లరిచేశారని పోలీసువారు వారి మీద నేరారోపణ చేశారు.

# అ. భా. విమాన కార్మిక ఫెడరేషన్ మహాసభ

## జనవరి 6, 7, 8 తేదీలలో బొంబాయిలో జరుగుతుంది

హైదరాబాద్, నవంబరు 15: అఖిల భారత విమాన కార్మిక ఫెడరేషన్ ప్రథమ మహాసభ జనవరి 6, 7, 8 తేదీలలో బొంబాయిలో జరుగుతుంది. దానికి 15 వేలమంది కార్మికులతరఫున 150 మంది ప్రతినిధులు హాజరు కాగలరని భావించబడుతున్నది. సంఘనిబంధన నియమావళిని, ప్రణాళికను తయారు జెయ్యటానికిగాను, అక్టోబరు 22 న బొంబాయిలో ఏర్పాటు చెయ్యబడిన అడ్‌హాక్ కమిటీవారు యిక్కడ యీనెల 12, 13 తేదీలలో సమావేశమై, దేశంలోని విమానకార్మికులందరు "కొన్ని విమానకంపెనీల మూసివేత, కొన్ని మార్గాలను ఆపు చేయుట, కార్మికులను ఉద్యోగంనుండి తొలగించుట," మొదలగు వాటిపట్ల నిరసన తెలియజేస్తూ యీనెల 17 న అరగంటసేపు లాంఛనం సమ్మె చేయవలసిందని కోరుతూ ఒకతీర్మానం చేశారు. అడ్‌హాక్‌కమిటీ సంఘనియమ నిబంధనావళిని, ప్రణాళికను తయారుచేయుట పూర్తి అయింది. ఈ నిబంధనావళి ప్రకారం, ఫెడరేషన్ కార్యవర్గంలో 12 మంది, జనరల్ కౌన్సిలులో 30 మంది ఉంటారు.

భారతదేశంలోని విమాన సర్వీసులన్నిటినీ జాతీయం చెయ్యవలెనని ప్రణాళికలో కోరబడింది.

# మైసూరులో విద్యాభివృద్ధి

## సి. ఆర్. రెడ్డిగారి నివేదిక

బెంగుళూరు, నవంబరు 15: సంస్థానంలో గల ప్రతి పాఠశాలలోను, వ్యవసాయము, గృహశాస్త్రము ఐచ్ఛిక విషయములుగా, ప్రవేశపెట్టవలెనని మైసూరు విశ్వవిద్యాలయ ప్రోచాన్సలరు డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు సిఫార్సు చేశారు. మైసూరు సంస్థానంలో విద్యావిషయమై రెడ్డిగారు ప్రభుత్వ కోరికమీద ఒక నివేదిక తయారుచేశారు. మైసూరు విశ్వవిద్యాలయ శాశ్వతనిధికింద సంస్థాన ప్రభుత్వం ఒకకోటి రూపాయలివ్వవలసిందనీ, ఇదేగాక బెంగుళూరులో విశ్వవిద్యాలయానికి 200 యకరాల స్థలం ప్రత్యేకించి ఉంచవలసిందనీ, గృహశాస్త్ర కళాశాల భవన నిర్మాణమునకు ప్రత్యేక గ్రాంటు యివ్వవలెననీ కూడ రెడ్డిగారు సిఫార్సు చేశారు

# కాకినాడ మునిసిపాలిటీ

## 21 వ వార్డు రిజర్వుస్థానపు ఎన్నిక

కాకినాడ, నవంబరు 15: ఈ పట్టణ మునిసిపాలిటీ 21 వ వార్డులోని ఆంగ్లో-ఇండియన్ రిజర్వు స్థానానికి యీ క్రింది కార్యక్రమం ప్రకారం ఎన్నికలు జరుగునని మునిసిపల్ కమిషనరు తెలియజేస్తున్నారు. నామినేషన్లు 23, 24, 25 తేదీలలో తీసుకోబడును. 26 వ తేదీ నామినేషన్ల పరిశీలన, అప్పీలు లేకపోయినచో 30 వ నికరమైన నామినేషన్ల ప్రకటన. అప్పీలున్నచో డిసెంబరు 5 న, డిసెంబరు 19 న ఎన్నికలు. 20 న ఓట్ల లెక్కింపు.

# ఢిల్లీలో 50 వేల విద్యార్థుల సమ్మె

## జీతాలు పెంచినందుకు నిరసన ప్రదర్శనలు

న్యూఢిల్లీ, నవంబరు 16: ఢిల్లీలో సెకండరీ, హయ్యర్ సెకండరీ స్కూళ్లలో చదువుతున్న 50 వేల మంది విద్యార్థులు స్కూలు జీతాలను అధికారులు పెంచినందుకు నిరసనగా ఈ వేళ సమ్మెచేశారు. ఢిల్లీలో స్కూల్సు పూర్తిగా మూతబడి ఆదేశాన్ననుసరించి వీరీ సమ్మెను చేశారు.

వేలమంది విద్యార్థులు,500 మందికిపైగా విద్యార్థినులు ఢిల్లీ చీఫ్‌కమిషనర్ కార్యాలయం ఎదుట ప్రదర్శనలు జరిపారు. చీఫ్ కమిషనర్ వాళ్లతో మాట్లాడి తనకు చేతనైన సహాయం చేస్తానన్నారు.

నవంబర్ 1 వ తేదీనుంచీ జీతాలు ఎగభాగం పెంచబడినవి. జీతాలను తలిదండ్రుల ఆదాయాన్నిబట్టి హెచ్చుతగ్గులుగా తీసుకొనే పద్ధతిని మళ్ళీ ప్రవేశపెట్టాలనీ జీతాలకు ఏకటి ప్రమాణానికి తగ్గించాలనీ విద్యార్థులు కోరారు.

**2 ఆరోగ్య జీవితమునకు రెండు మార్గములు**

మీ నరముల నిర్మాణము, లివర్ పిత్తరసములు, హృదయ గ్రంధులు సక్రమముగా పనిచేయుచున్నప్పుడు మీరు సర్దుష్టమైన ఆరోగ్యజీవితమును అనుభవింప గలరు. దీనికి పేరొందిన ఈ ఔషధ ద్వయము కంటె ఉత్తమమైనవి లేవు.

**చ్యవన్‌యోగ్**

ఎ. బి. సి. డి. విటమినులు గలిగిన మెదడు, నరముల టానిక్కు.

**రక్తోజ్** రక్తము పట్టించు టానిక్కు.

డక్కన్ ఆయుర్వేదాశ్రమం ఫార్మసి లిమిటెడ్
హైదరాబాద్ - డక్కన్.



**Stanes**

**స్టేన్సు వారి ఎత్తితే బిల్ శుభ్రమైన కాఫీ**
ప్రసిద్ధమైన స్టేన్సు కంపెనీ నుండి సప్లయికాబడు తక్కువ ఖరీదురకము

1, 2, 3, 7, 14, 20 పౌ॥ టిన్నులలో దొరుకును.

7 lbs. Stanes PURE COFFEE The United Coffee Supply Co. Ltd. STANES & CO., LTD.

మంచివార్త: రుచియైన స్టేన్సు ఎత్తి లేబిల్ శుద్ధమైన కాఫీ ధారాళముగా దొరుకును. తామే పొడిచేసికొనువారికి వేయించిన కాఫీ గింజలు కూడా చిక్కుచున్నవి.
ఇవి ప్రత్యేకంగా తపాలా బర్చులు భరించి పంపబడును:- ఉత్తమరకపు వచ్చి కాఫీ గింజలు, పీబెర్రీ, పెద్దపెద్ద తట్టగింజలు. 10, 30 పౌనుల సంచులలో దొరకును. షరతులకు:- ది యునైటెడ్ కాఫీ సప్లయి కో., లి. కోయంబత్తూరు, దక్షిణ ఇండియా.

ట్రివేంద్రం ఏజంటు శ్రీ డి. ఆర్. హరిహరన్, చెంతిట్టై, చాలై
కోయంబత్తూరు ఏజంటు ప్రొవిజన్ స్టోర్సు, రాజా స్ట్రీట్.

THE PICK OF THE SOUTH



ప్రకటన
**కొత్త సీజనుకు నూతన ధారివాల్ వస్త్రములు**

బాగా ముస్తాబయ్యే వారందరు ప్రతిచోట యీ యేడు ధారివాల్ వస్త్రములను ధరించెదరు. ఎందుకనగా అందమైన క్రొత్త ధారివాల్ డిజైనులు, నేతలు, వెనుకటివాటికన్న యిప్పుడు శ్రేష్ఠతరముగా నున్నవి. అందరి అభిరుచులకు తగినట్లు అందరికి అందుబాటులోనుండునట్లు తయారుచేయబడినవి. ప్రతిగుడ్డ పూర్తివివరములు కలిగి, అంతా వున్నితో తయారైనట్లు హామీకలది. క్రొత్తరకాలలో ముందుగా ఎన్నుకొనుటకు త్వరగా కొనండి. ఇవి ఎల్లచోట్ల పెద్ద బట్టల వర్తకులవద్ద లభిస్తాయి.

క్రొత్త వర్తకులు వారికి చేరువలోవున్న టోకు వర్తకుల పేరు, విలాసం నిమిత్తం మిల్లులకు వ్రాయవచ్చును.

**Dhariwal ALL WOOL FABRICS**

అందమైన వర్‌సెర్సు - సూపర్ ఫ్లానెల్సు - శ్రేష్ఠమైన ట్వీడ్సు - రగ్గులు - లోయీస్ - బ్లాంకెట్లు - అల్లికదారాలు వగైరా.

తయారుచేసినవి
ది న్యూ ఎగర్టన్ వులెన్ మిల్సు, ధారివాల్, తూర్పు పంజాబ్, ఇండియా.


# ఆంధ్రరాష్ట్రంలో బియ్యం కరువు

## కొన్నిచోట్ల ఇన్‌ఫార్మల్ రేషనింగు అమలు

### విజయవాడ

నవంబరు 14: తుపాను అనంతరం ఇక్కడ బియ్యం దొరకుటలేదు. అందరు చాలా బాధపడుచున్నారు. ఏషాపులో నయినా ఇచ్చుచున్నారని తెలియగనే వందలకొలది జనం ప్రోగుఅయి, త్రోసుకుంటూ ఆఖరికి దెబ్బలాటలలోకి దిగుచున్నారు. ఈ బియ్యంకొరతవల్ల పనిపాటలకు పోవుటకు వీలులేకుండా యున్నది. పైగా రెండు సేర్ల బియ్యంకన్న ఎక్కువగా దొరకటంలేదు. అదీగాక బొంబాయి రవ్వ సేరు, గోధుమలు సేరు తీసుకున్నగాని రెండుసేర్ల బియ్యం ఇవ్వరట. గోధుమలు పుచ్చిపెంకె పురుగులతో వున్నవి. బొంబాయి రవ్వయూవత్తూ తెల్లని పురుగులతో నిండి యుండుటేగాక నోట్లోవేసుకుంటే చేదుగా యున్నది.

### రాజమహేంద్రవరం

నవంబరు 13: సుమారు వారంరోజుల నుండి యిచ్చట బియ్యంసరిగా దొరకక ప్రజలు చాలాయిబ్బంది పడుచున్నారు. బ్లాక్‌మార్కెట్టులో కుంచం రూ 4 వరకు కూడ అమ్ముతూన్నట్లు తెలియుచున్నది.

### వెంకటగిరి

నవంబరు 14: గతనెల 2వ తేదీనుండి ఇక్కడ ఇన్‌ఫార్మల్ రేషనింగు ప్రారంభించినారు. అప్పటినుండి వడ్లు బియ్యము 8 ఔన్సుల వంతున యిచ్చుచుండిరి ప్రస్తుతము హోల్‌సేల్ డీలర్ల వద్ద బొత్తిగా స్టాకులేదు. ప్రజలు బియ్యము సప్లయిలేక ఒకపూట తిండికి గూడా గింజలు దొరకక నానా తిప్పలు పడుచున్నారు. (స్వ. వి.)

### విడదవోలు

నవంబర్ 11: యిటీవల వచ్చిన తుపాను వల్ల ఇచ్చటి బియ్యం మిల్లులన్నీ పాడై పోయినవి. బజారులో ప్రజలకు కావలసిన బియ్యం దొరకక కటకటలాడుచున్నారు. యీ రోజున యీ గ్రామం వచ్చిన జిల్లా సప్లై ఆఫీసరు గారిని ప్రజలు దర్శించి పరిస్థితి మొరపెట్టుకున్నారు. అంతట ఆ అధికారి అత్యవసర కొలత క్రింద బియ్యం గాని ధాన్యం గాని విడుదలచేసి సప్లై చేయించవలసినదిగా స్థానికఫుడ్ యిన్స్‌పెక్టరు గారికి వుత్తర్వులిచ్చిరి.

స్థానిక మిల్లర్లు కొందరు తాలూకా సప్లై ఆఫీసరు గారు లైసెన్సు చేసిన పర్మిట్లుకు బియ్యం లేవనే సాకుతో బియ్యం యిచ్చుట లేదు. దీనితో ప్రజల బాధ మరింత యెక్కువైంది. నిన్న కొవ్వూరు తాలూకా సప్లై ఆఫీసరు గారు 60 బస్తాల బుడమ ధాన్యం విడుదల చేశారు. జిల్లా సప్లై ఆఫీసరు గారిని ఆంధ్ర పత్రిక విలేఖరి కలుసుకొని మాట్లాడగా ప్రజలు అవసరం వుండీ పట్టుకుని వెళ్లే సరుకు కన్న దాచుకునేందుకు తీసుకొని వెళ్లుట యెక్కువైనదనిన్నీ, అందుచే రేషనింగు తదితర ప్రాంతాలలో కూడా అమలు జరుపవలసి వచ్చునని అదియే ఆలోచించుచున్నామని చెప్పిరి. (స్వ. వి.)

### మంగళగిరి

నవంబర్ 12: ఇక్కడ చిల్లరగా బియ్యపు దుకాణములలో బియ్యం దొరుకుట, బహు దుర్లభముగా నున్నది. గత అయిదు, ఆరురోజుల నుండి, బియ్యము నకు తేలాది ప్రజానీకము బజారు వెంట తిరుగుచున్నారు. మంగళగిరిలో 13 షాపులు వుండి కూడా, ఒకొక్కక్క యింటికి, 2 సేర్లు, లేక, 3 సేర్లు యిస్తూయున్నారు. రోజూను, ఏదో ఒక షాపు తీసి, మీద ప్రజలను చాలా కష్ట పెడుతున్నారు. అవి ముందువారికే గాని, కొంచం ఆలశ్యము అయిన వారికి దొరకటము లేదు. ప్రొద్దున వెళ్లిన వారు, మళ్లా సాయంత్రమునకే, తిరిగిరావటము జరుగుచున్నది. పని పాట్లకు చాలా యిబ్బందిగా యున్నది యీ చుట్టు పట్ల పల్లెలలో కూడా బియ్యము దొరకటము లేదు. ప్రభుత్వము వారు వెంటనే యీ తాలూకాకు బియ్యం సప్లై చేయనిచో క్షామమునకు, గురికావలసి వచ్చును. అని గోలి వీరాంజనేయులు గారు వ్రాసిరి.

## చక్కెర క్షామం: పంపకం లోపాలు

### చిత్తూరు

నవంబర్ 14: ఇక్కడ సుమారు 10 రోజులనుంచి ప్రజ చక్కెర దొరకక అవస్థపడుచున్నారు. అధికారులు [illegible] ప్రజలకు [illegible] సెల్ షాపులకు విడుదల [illegible] ప్రతి [illegible] నుపాపునందు కార్డు హోల్డరుకు ఒక [illegible]

# తుపాను, వరద బాధితులకు సహాయం

## రోటరీ క్లబ్బువారి సన్నాహం

విజయవాడ, నవంబరు 14: కృష్ణా జిల్లాలో ఇటీవలి తుపాను, వరదలవల్ల బాధితులయినవారికి సహాయము చేయుటకు అవలంబించదగు చర్యలను వివరించే నివేదిక నొకదానిని ప్రభుత్వానికి సమర్పించు నిమిత్తం స్థానిక రోటరీ క్లబ్బువారు తయారుచేయుచున్నారు. ఈ క్లబ్బుఅధ్యక్షుడు చాగంటి సూర్యనారాయణమూర్తి గారి అధ్యక్షతను నిన్న జరిగిన సమావేశములో, ఈ పట్టణంలో బియ్యం పంపకం పనిని కొంత ఈ క్లబ్బుకు అప్పగించవలెనని ప్రభుత్వాన్ని కోర నిశ్చయించిరి. రోటరీగవర్నరు జి. యస్. హోసాలీ, పూర్వగవర్నరు ఎస్. ఆర్. శర్మ, ఆంధ్రదేశంలోని పలుతావులలోని రొటేరియన్లు పి. ఎస్. టి. శాయి, పి. హెచ్. విఠల్ రావు, కె. నాగేశ్వరరావు, డి. యం. సాపూర్, కె. రామకృష్ణయ్య, పి. వీరయ్య ప్రభృతులు ఇందు పాల్గొనిరి. వీరికి పి. వి. సుబ్బారావుగారు అల్పాహారవిందు, బచ్చు వెంకటేశ్వర్లుగారు భోజనవిందు చేసిరి.

## డై. మె. మా. కంపెనీ కార్మికుల సమ్మె వాయిదా

విజయవాడ, నవంబరు 14: స్థానిక డైమండ్ మెషీనరీ మాన్యుఫాక్చరింగ్ కంపెనీ కార్మిక సంఘంవారు నేటినుంచీ ప్రారంభింపవలసిన సమ్మె ఒక పక్షం రోజులవరకూ వాయిదా వేశారు. కంపెనీ యజమానులు డిప్యూటీ లేబర్ కమీషనరు చేసిన పరిష్కారమును అమలుజరుపలేదన్న కారణాన కార్మికులు సమ్మె నోటీసు ఇచ్చారనీ, కాంగ్రెస్ ప్రముఖులు, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడు కలుగచేసుకొని వారి కోరికలుతీర్చే భారం వహిస్తామనీ, సమ్మెచేయవద్దనీ కోరారనీ దానిమీదట సమ్మె వాయిదా పడిందనీ తెలిసింది.

---

యూనిట్‌కు పలనువంతున పంచిపెట్టుచున్నారు. ప్రజలు కొన్ని రేషను షాపులలో కలహములుచేసికొని కష్ట పడుచున్నారు. స్వ. వి.

### వెంకటగిరి

నవంబర్ 14: ఇచ్చట చక్కెర ధర వీశ 3 రూ నుండి 4 రూ దాకా పెరిగినది. అధరకుకూడా అరుదుగా దొరుకుచున్నది; కాఫీ హోటళ్ళలో, టీదుకాణములలో శాక్రిన్ బెల్లపుజీరా ఉపయోగిస్తున్నారు. స్వ. వి.

### రాజమహేంద్రవరం

నవంబర్ 13: ఇచ్చట సుమారు 15 రోజులనుంచి పంచదార అసలు లభించుటలేదు. బ్లాక్ మార్కెట్టులో వీశ రూ 3-8-0 అమ్ముతూన్నట్లు తెలియుచున్నది. బెల్లంగూడ రూ 2 వరకు పెరుగుటవల్ల ప్రజలు చాల బాధపడుచున్నారు. స్వ. వి.

### హిందూపురం

నవంబరు 14:— ఈ వూరియందు బియ్యపు రేషనుకార్డు కలవారికి ఒక్కసారికి మాత్రం 3 సేర్ల చక్కెర ఇచ్చుచున్నారు. ఇంకనూ ప్రతివారము ఇచ్చు విషయంలో రేషనుషాపు వారలు ఏమియూ చెప్పుటలేదు. పైగా ఎక్కువ సంఖ్యగల కుటుంబములకు ఈ మూడుసేర్లు ఏమాత్రము చాలదని ప్రజలు కష్టపడుచున్నారు. కావున కుటుంబములలో గల జనసంఖ్యను బట్టి ఇవ్వవలసిన కోటా నిర్ణయిస్తే దాగుంటుందని ప్రజలభిప్రాయపడుచున్నారు. మిక్సడ్ రేషను కార్డు హోల్డర్లకును, రాగులు జొన్నలు తినువారలకును చక్కెర ఇవ్వడమేలేదు. (స్వ. వి.)

### హొసపేట

నవంబరు 13:— ఇచ్చట చక్కెరకు అట్టె ఇబ్బంది పడుటలేదు. బియ్యపు రేషను కార్డుగల వారందరికి వారమునకు ఒక వీసె, అర్ధవీసె వంతున వీసె. 1-13-0 చొప్పున రేషన్ డిపోలో ఇచ్చుచున్నారు. బెల్లపుధర విపరీతముగా పెరిగిపోయినది. మణుగు 12-0-0 ధరకు అయినది.

### పెనుగొలను

నవం 13:— ఈ గ్రామంలో సుమారు రెండునెలలపై నుండి పంచదార దొరుకుట లేదు. ప్రజలకు చాలా యిబ్బందిగా ఉన్నది. పంచదారబదులు బెల్లం ఉపయోగించుదామనిన వీసె 1-8 2-8-0 పెట్టినా దుర్లభముగా ఉన్నది. పంచదార ఏ ధరకును దొరకుటలేదు.

### విజయవాడ

పంచదార దొరకుటలేదు. అచ్చట కూడా జనం మానుకున్నారు. బలవంతులు ఎక్కువగా తీసుకుని తిరిగి వీసె మూడురెట్లు రూపాయల కమ్ముచున్నారు. మిఠాయికొట్టులు వీసె రూపాయలు ముప్పావలా, చింతపండు వీసె రూపాయన్నర మొదలు రెండు రూపాయల వరకు అమ్ముచున్నారు. [illegible] ప్రజలలో అసంతృప్తి [illegible] [illegible] గా పెరుగుచున్నది [illegible] [illegible] ఇచ్చుచున్నామని చెప్పుచున్నారు.


మీ శ్రమవులను తెలిసికోండి: **క్షయరోగము**

విస్తీర్ణమైన మనదేశములో క్షయరోగమువల్ల ప్రతిసంవత్సరము, లక్షలాది ప్రజలుమరణించుచున్నారు. అయినను ప్రజలందరి యొక్క సహకారముతో చక్కని కట్టు దిట్టములుచేసి క్షయరోగమునుపూర్తిగా కొద్దిసంవత్సరములలో అరికట్టవచ్చునని ఆధునిక శాస్త్రములు చాటుచున్నవి.

క్షయరోగమును అరికట్టుటకుచేయు తొలిత్రమవేమనగా రోగముయొక్క ప్రథమదశలోనే వైద్యపరీక్ష అవసరము. ఈ వైద్యపరీక్షనకాలములోపొందిన క్షయరోగము మూడువంతులు నివారించును.

క్షయరోగము ప్రారంభదశలోనప్పుడాని, పరిమూ సులభముగా నిర్లక్ష్యభావముతో చూడబడుచిహ్నములతో అనగా, స్వల్ప దగ్గు, లేతజ్వరము సాధరణ అచతురత, బూరుసు తగ్గుట మున్నగు వాటితో బయలుదేరును.

అతిసూక్ష్మముగాను, మిక్కిలి త్వరగాను క్షయరోగమును నిర్ణయించుటకు గుండెను ఎక్సరే పరీక్ష చేయించుట అవసరము. సాధారణ వైద్య పరీక్షవల్ల యధార్థముగాతెలిసికొనబడని చిహ్నములు ఎక్సరే పరీక్షవలన తేటతెల్లమౌను.

క్షయరోగమును ఎదుర్కొనుటకు తొలుత దానియొక్క ప్రథమ చిహ్నములను కనిపెట్టి వెంటనే సరియైన వైద్య సహాయము పొందవలెను.

సాధారణముగా క్షయరోగమునకు ప్రథమ చిహ్నము లేమనగా:

దగ్గు: ప్రతిదగ్గు ఎక్సరే పరీక్ష గురియౌ నక్కర లేదు. కాని నిరంతరముగావచ్చు దగ్గుకుమాత్రము ఎక్సరే పరీక్ష అవసరము.

బూరుసు తగ్గుట: ఇది అధిక కాయకష్టమువల్ల, లేక అకాలభోజనమువల్లగాని, మనస్సుకు అధిక కలవరత వల్లగాని కలుగవచ్చును. అంతమాత్రమున క్షయరోగ సూచనని తలంచరాదు. బలహీనత, అలసట, దగ్గు, బూరుసు తగ్గుట యివన్నీ ఏకగ్రీవముగా సంభవించినప్పుడు వైద్యసలహా చూడగోరుట అత్యవసరము.

నెమ్మదైన తీఅనిజ్వరము: ముఖ్యముగా సాయంకాలమందు స్వల్ప శరీర వుష్ణోగ్రత.

దరిమిలాకలిగే క్షయరోగ చిహ్నములేమన్న, వుమ్మిలో రక్తముపడుట, రాత్రులందు కలవరతలు, రక్తహీనత, ఆకలి లేకపోవుట, అజీర్తి, పుపుసవేష్టనముయొక్కవాపు, బారస్వరము వర్ణధారము, మున్నగునవి.

**మీ వైద్య సలహా తరచు పొందండి**

దేశీయ ఆరోగ్యాభివృద్ధికై ప్రచురణ:
అలెంబిక్ కెమికల్ వర్క్సు కంపెనీ, లిమిటెడ్, బరోడా.

AL 918 TELUGU



**'పాలుడ్రిన్' మలేరియా నుండి రక్షణకు**

ఇప్పుడు మూడు మాత్రలకు బదులు ఒకే మాత్ర

'పాలుడ్రిన్' మలేరియా నుండి రక్షణకు

అధికను: క్రొత్త పెద్ద 0·3 గ్రాముల 'పాలుడ్రిన్' మాత్ర . . . . వారమునకు ఒక్కటే మాత్ర— మిమ్ములను మలేరియా నుండి రక్షించును, ఉష్ణ ప్రదేశ పరిస్థితులకు చెడిపోకుండునట్లు ప్రత్యేకముగా తయారు చేయబడి, సీలు చేసి, కాగితములో నుండి అగుపడునటువంటి ఎనిమిది మాత్రలు వరుస ఇప్పుడు మీకంద చేయబడుచున్నది.

మలేరియా నుండి రక్షణ

ఒక ప్యాకెట్టు 8 అణాలు లెక్క ఒక మాత్ర ఒక అణా

ICI
ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ (ఇండియా) లిమిటెడ్

PH.19


Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras.